మద్రాస్ సినీ లేబొరేటరీ వారి

# నరాంతకుడు

దర్శకత్వం **రామన్న** • మాటలు పాటలు **శ్రీశ్రీ** సంగీతం **పామర్తి**




ఆంధ్ర, సీడెడ్
**మహాలక్ష్మి పిక్చర్స్**

నైజాం
**శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్**

# ఉత్తరాలు

## ముఖచిత్రం

23—8—63 ప్రత్యేక సంచిక అట్టమీద బొమ్మ చాలా అందంగావుంది అయితే, ఆ పాపాయి—కాదు, భావి భారత పౌరుడు—వినాయకుని పూజ చెయ్యకున్నాడేమి ? అమ్మ ఒళ్లో ఉండి ఉంటే చిట్టి చేతులతో పూజించేవాడేమొ?

కమల (కళ్యాణ)

*　　*　　*

23—8—63 వతేదీ వినాయక చవితి ప్రత్యేక సంచిక 'ముఖచిత్రం', 'విఘ్నేశ్వరపూజ' చాలా ఆకర్షణీయంగా ఉన్నది కానీ, ఒక చిన్న సందేహం కలిగినది మూషిక వాహనుడైన విఘ్నేశ్వరుని చెంత ఉండవలసిన మూషికం ప్రతిక కుడి వైపు మూల (బాలిక వెనుక పీటవద్ద) ఉన్నది గనుక ఇది చిత్రకారుని పొరబాటా ? లేక విఘ్నేశ్వరుడు తన పండుగ సందర్భంలో కుడుములు, ఉండ్రాళ్లు భక్షించే నిమిత్తం ఎలుకను స్వేచ్ఛగా వదిలేశాడా?

తలిసెట్టి ఆనంద్ (తిరుపతి)

## ప్రత్యేక సంచిక

విఘ్న నాయకుని వదనాన ధరించి నిండు చూలాలిలా బరువుగా అడుగు వేస్తూ మాధుర్యంతో మానసోల్లాసాన్ని కలిగించే కథలను—కుక్షిలో ఇముడ్చుకుని రవి వార సుప్రభాతాన దర్శనమిచ్చి మా చేతుల్లో వాలిన "వినాయక చవితి ప్రత్యేక సంచిక" ఆశించిన దానికన్న అధికానందాన్ని కలిగించింది "వధూటి", "కళ్యాన,,,, కింకిణి" వంటి కథలు మదిలో మరువలేని అనుభూతిని కలిగించి వాటి ఉత్తమ స్థాయిని రుజువు చేసుకున్నాయి ఈ ప్రతిక ఎప్పుడూ ఇలానే ఆకర్షణీయంగా ఉండాలని ఆశిస్తున్నాను

ఆర్ వి సుబ్రహ్మణ్యం (శ్రీకాకుళం)

*　　*　　*

వినాయక చవితి సందర్భముగా మీరు ప్రతికను హాస్య కథలతోను, కార్టూనులతోను ముంచేశారు ముఖ్యముగ కథలు "ప్రజా సేవకుడు కాళాస్త్రి" "అప్పుల నరసయ్య" మమ్ములను చాల ఆనందపరచినవి ఇక "వధూటి" కథలో శేఖరం పరిస్థితికి మాకు నవ్వు ఆగలేదంటే నమ్మండి

తుమ్మల రఘునాథ్, కొడాలి విష్ణుమూర్తి (అప్పికట్ల)

## అవీ-ఇవీ-అన్నీ —

ఆంధ్ర సచిత్ర వార ప్రతిక 23—8—63 ప్రత్యేక సంచికలోని 'అవీ ఇవీ అన్నీ' శీర్షికలో 'రేలంగి చిత్ర మందిర్' 63 ఫిబ్రవరి 8 వ తేదినుంచి 'శ్రీ కృష్ణ పాండవ యుద్ధము'తో ప్రారంభించబడినదని వ్రాశారు కాని, ఆ థియేటరు 'శ్రీ కృష్ణార్జున యుద్ధము' చిత్రముతో ప్రారంభించబడినదని గ్రహింప ప్రార్థన

అట్లూరి శరత్‌బాబు (విజయవాడ)

## భారీయెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం 6-9-63
శోభకృన్నామ సం॥ భాద్రపదమాసం॥ బహుళ విదియ
సంపుటము 56 సంచిక 1

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా రూ 13 00 ఇతర దేశాల కు-సముద్రం మీద (Sea Mail) రు 20 00 (విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు-రూ 114 00 అమెరికా రూ 176 50 ఆస్ట్రేలియా 135 00)

*

విడిప్రతి 25 న పై.
సంవత్సర చందా : 13-0-0

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7 తంబుచెట్టి వీధి, మద్రాసు-1




రంగారావు 'ప్రత్యేక చిత్రం'!

# మనలోమాట

గతవారంతో ముగిసిన 'తెరమీద-తెరవెనుక' శీర్షికకు సంబంధించిన సమీక్షను యీ సంచిక 24, 25 పేజీలలో వేశాము పైవారంనుంచీ మరొక చిన్న నవలను సీరియల్ గా వేస్తున్నాము ఈ నవలకు సంబంధించిన వివరాలు యీ సంచికలోనే వేరేచోట యిస్తున్నాము

* * *

గత పదహారు వారాలుగా వస్తూన్న చిన్న శీర్షిక "నామరూపాలు" ఈ సంచికతో ఆయిపోతున్నది చిన్నదే అయినా యీ శీర్షిక మా పాఠకులను బాగా ఆకర్షించినట్లు, మాకు వచ్చే ఉత్తరాలనుబట్టి భావిస్తున్నాము

* * *

ఆంధ్రసచిత్రవారపత్రిక 30-8-'63 సంచిక ముఖచిత్రం శ్రీమతి అంజలీదేవి బొమ్మను, ఈ వారం ముఖచిత్రం శ్రీ రంగారావు ఛాయాచిత్రాన్ని కూడా, తీసినది శ్రీ ప్రభాకర్

* * *

మా కార్యాలయానికి యిటీవల వస్తూన్న వ్యంగ్య చిత్రాలలో ఎక్కువగా "చీకటి కార్టూనులు" వస్తున్నాయి! బహుశా యిలాంటి కార్టూనులు వేయడంలోగల సౌలభ్యమే యువచిత్రకారులలో కొందరు యిటువంటి కార్టూనులు ఎక్కువ వేయడానికి కారణమనుకుంటున్నాము ★

# లోకంపోకడ



కామరాజ్ పథకం బాగానే సంచలనం తెస్తోంది కాని అది 'వ్యాధి'ని పూర్తిగా కుదర్చగలమందేనా? అని....

# విషయానుక్రమణిక


**కథలు :**

| | |
|---|---|
| తన్నెకలలు | — 18 |
| శ్రీకృష్ణజననం | — 22 |
| రెండునాల్కలు | — 26 |

**సీరియల్ కథలు :**

| | |
|---|---|
| ప్రేమకు పగ్గాలు | — 12 |
| కొలంబా | — 20 |

**శీర్షికలు, వ్యాసాలు, సినిమా.**

ఉత్తరాలు — 3, ఊవెన్ కార్టూన్ — 6, న్యూఢిల్లీలేఖ — 7, రాజధానికబుర్లు — 9, రంగవాల — 10, అవీ ఇవీ అన్నీ 11, వనితాలోకం — 14, వనితావాణి 15, కథలో కొన్ని చిరాకు పుట్టించే మాటలు — 17, నా అనుభవాలోకెల్లా పెద్ద పరిశోధన (19) – 27, తార-కొలువు — 28, వారఫలాలు — 32.



వెలుపలికి దోవ
అమ్మయ్య! ఏదో పీడకల కన్నానంతే!
ముఖ్యమంత్రి పదవి
బ్రహ్మానందరెడ్డి
అయ్యో! ఉత్తి కలేనా!
శుభవార్త! వ్యతిరేకులంతా వెళ్ళిపోయారోచ్!
పాపం వాళ్ళని అభినందించాలో ఓదార్చాలో తెలీకుండా వుంది!

# పై పదవికి అవకాశంగా మారిన పదవీత్యాగం?

**శ్రీ కృష్ణ**

ప్రభుత్వం పట్ల ప్రతిపక్షాల అవిశ్వాస తీర్మానం, కాంగ్రెస్ పార్టీ వ్యవస్థీకరణం ఈవారం పదిమంది నోట్లో నానుతూఉన్న విశేషాలు

అవిశ్వాస తీర్మానమొందే — ఇది మహా మంద కొడి ప్రయత్నంగా అగుపించింది ప్రతిపక్ష సభ్యుల, ముఖ్యంగా ఆచార్య కృపలానీ ఉపన్యాసాలు, చాలా నీరసంగా, నిరుత్సాహకరంగా ఉన్నాయి ఆచార్య కృపలానీ ఉపన్యాసం చాలా పేలవంగా ఉంది అందుకనే అట్టే మందిని ఆకర్షించలేదు ఆయనతో పోల్చిచూస్తే శ్రీమసానీ ఉపన్యాసమే చాలా మెరుగ్గా ఉంది చెప్పదల్చుకున్న అంశా లేమిటో కుండబద్దలు కొట్టినట్లు చెప్పేశారు అసలు ఈ వ్యాసం రాసేనాటికి జరిగిన ఉప న్యాసాల్లో కల్లా బాగా ఉంది ఆంగ్లో ఇండియన్ నాయకుడు ఫ్రాంక్ ఆంథోనీచేసిన ఉపన్యా సమే దేశాన్ని అరాచకం నుంచి రక్షిస్తున్నది కాంగ్రెస్ పార్టీయేనని, ఈ దేశానికి ప్రజా స్వామ్యం వ్యవస్థ ఏర్పడటానికి ముఖ్యకారణం కాంగ్రెసేనని ఆయన అన్నారు ఈ అవిశ్వాసతీర్మా నాన్ని బలపరిస్తే అందువల్ల కమ్యూనిస్టులు లాభం పొందుతారు గనుక, ఈ తీర్మానాన్ని తాము సమర్థించబోవటం లేదని కూడా ఆయన అన్నారు

సంఖ్యా బలంలో లోగిపోవటమే కాక ప్రతి పక్షాలు ఇంతవరకు కాంగ్రెస్ పరిపాలన ఎందుకు పడిపోవాలో సబావైన కారణాలతో నిరూపించ లేక పోయాయి కాంగ్రెస్‌పై ప్రతి పక్షాలు సబావైన కారణాలతో ఆరోపించలేక అమాత్రాన కాంగ్రెస్ తన ఇల్లు చక్కబరచుకో కూడదని కాదు అసలీ పని ఈవరకెప్పుడో జరిగి ఉండా ల్సింది ఈ విషయంలో శ్రీ ఫ్రాంక్ ఆంథోని చాల ముఖ్యమైన విషయం ఒకటి చెప్పారు

"ఇప్పుడు జరుగబోయె పార్టీ సంస్కరణలో అందరితోపాటు అవినీతిపరులైన కొందరు కాంగ్రెస్ మంత్రులను గద్దె దింపి పార్టీ పదవులు అప్పగిస్తే పార్టీ కూడా అవినీతికి ఆలవాలమవుతుందని అన్నారు కాని ఇందులో శోచనీయమైన విషయమేమిటంటే మనమంత్రుల్లో కొందరు అవినీతిపరులున్నారని కూడా ప్రధానమంత్రికి నమ్మకం కుదరటంలేదు

ఈ చర్చను ఆసరాగా తీసుకుని కమ్యూనిస్టు నాయకుడు ముఖర్జీ అమెరికన్లు, వారితోపాటు, ముఖ్యంగా మన ఆర్థిక మంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ ఆహార వ్యవసాయ మంత్రి శ్రీ యస్ కె పాటిల్‌ల మీద దుమ్మెత్తి పోశారు అమెరికా ఒక ప్రక్క తన ఆయుధాల ద్వారా వాణిజ్యాన్ని పెంపొందించుకుంటుంటే, మన దేశంలో కొన్ని రకాల ఆయుధ సామగ్రిని తయారుచేస్తున్నం దుకు సోవియట్ రష్యాను ఆయన ప్రశంసించారు

సైనిక అసన్నద్ధతను గూర్చి, చైనా దురా క్రమణ వల్ల— మన దేశంలో ఏర్పడిన ప్రజా చైతన్యాన్ని గూర్చి ఆచార్య కృపలానీ ఇంకా పలు వురు ప్రసంగించారు అయితే వీళ్ళల్లో ఒక్కరు కూడా ఈ ప్రజా చైతన్యం ఏవిధంగా ఎందుకు చెదిరి పోయిందన్న విషయాన్ని, ప్రభుత్వాన్ని ఇరుకుల్లో పెట్టే విధంగా చెప్పలేక పోయారు ఈ పనివీళ్ళు సవ్యంగా చేయగల్గి ఉంటే, ప్రభుత్వం చేసిన బలమైన అపరాధాల్లో దాని నిరూప ణగా రూపొంది ఉండేది

ఇలాగే అధికారాన్ని త్యజించి పార్టీకోసం పాటు పడే ఉబలాటం చిన్నగా సద్దు మణిగిపోవటంది

ఈ తీర్మానాని కనుకూలంగా చాలామంది మంత్రులు (వాళ్ల వాళ్ల వ్యూహం ప్రకారం) రాజీ నామాలు అంద జేశారు అయితే కామరాజు పథకం ఎందుకు కారణమైందనే దానికి చాలా వివరణ అవసరం

శ్రీ కామరాజు తీర్మానం ప్రతిపాదించినప్పటివి లక్ష్యాలు ఏమయినా అవి మాత్రం చాలా నిజా యితీతోను, స్వచ్ఛంద హృదయంతోనూ నిష్క ల్మష చిత్తంతోనూ రూపొందించిన వేనందుకు ఏ మాత్రం సందేహంలేదు అయితే ఢిల్లీలో వాళ్లంతా ఈ తీర్మానాన్ని నెహ్రూకు వారసుడు ఎవరు అన్న కారణంనే పరిశీలిస్తున్నారు పార్టీ యంత్రాంగానికి అధినేతకు గలిగినవ్యక్తికి శ్రీనెహ్రూ వారసుడు కాగల అవకాశాలు ఎక్కువని ఇక్క అందరికీ తెలిసిన విషయం ప్రస్తుత వ్యవస్థలో కాంగ్రెస్ అధ్యక్షుడు భారత ప్రధానికి ఉత్స విగ్రహమూర్తి లాంటి వ్యక్తి అని తెలియంది కాదు అందువల్ల కాంగ్రెస్ అధ్యక్షుడయ్యే వ్యక్తి ప్రధాని విశ్వాసానికి పాత్రుడై ఉండాలి ఈ కోణం దృష్ట్యా చూస్తే అసలు తగాదా శ్రీయుతులు లాల్ బహదూర్, మొరార్జీ, నందాల మధ్యనన్న మాట మిగిలిన ఇద్దరికన్న శ్రీ లాల్ బహదూర్ శాస్త్రికే ప్రధాన మంత్రి విశ్వాసంలో ఎక్కువ పాలు

ఇక్కడ ఇంకో సమస్యకూడా ఉంది ఈ దేశా నికి ప్రధానికా గల వ్యక్తి హిందీ మాట్లాడే ప్రాంతా తాల నుంచి రావటం జరుగుతుంది కానీ దేశం ఐక్యతతో ఉండాలంటే ఆ వ్యక్తి హిందీ ఇతరమైన ప్రాంతం ప్రజల విశ్వాసాన్ని చూరగొన గల్గాలి ఇక్కడ కూడా మిగిలిన ఇద్దరికన్న శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఎక్కువగా దక్షిణాది ప్రజల విశ్వాసాన్ని చూరగొన్న వ్యక్తి అదీకాక లాల్ బహదూర్ శాస్త్రిని కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎందుకు అభ్యర్థిగా నిర్ణయించారన్నదానికి చాలా కారణాలు ఉన్నాయి

దేశాన్ని ఐదు ప్రాంతాలుగా విభజించి, ఈ ఐదు మండలాలనీ ఒక్కొక్క ఉపాధ్యక్షుని చేతిలో పెట్టటం అసలు పథకం ఉద్దేశ్యమని ఈ వరకే వివరించాను అంటే లాల్ బహ దూర్ శాస్త్రి కాంగ్రెస్ అధ్యక్షులుగా, ఇప్పటికి వచ్చిన వార్తను బట్టి శ్రీ కామరాజ్‌ను దక్షిణ మండలానికి, యస్ కె పాటిల్ పశ్చిమ మండలా నికి ఉపాధ్యక్షులుగాను నియుక్తులౌతారని తెలు స్తోంది ఇక మిగిలిన ప్రాంతాలకు గాను ఉపాధ్యక్షులుగా శ్రీ యుతులు మొరార్జీ, జగ జీవన్‌రామ్, అతుల్‌ఘోష్‌ల పేర్లు వినవస్తున్నాయి. న్నాయి ఇక్కడికిది వూహాలోకపు హద్దు ఇక వాస్తవిక విషయానికి వద్దాం ఇప్పటికి వస్తున్న వార్తలని బట్టి శ్రీ మొరార్జీకి పార్టీలో ఉచిత స్థాన మిస్తూ, పార్లమెంటరీ బోర్డు అధ్యక్ష పదవి అంటగట్టాలనుకుంటున్నార్ట కాబట్టి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ద్వయ నాయక కాంగ్రెస్ అధ్యక్ష పదవిని అలంకరించటం జరిగితే, మొరార్జీదేశాయ్ వచ్చే సాధారణ ఎన్నికల్లో కాంగ్రెసు అభ్యర్థులకు టిక్కెట్లు పంపిణీకి అధిపతౌతారు అంటే కాంగ్రెస్ అధ్యక్షుడు అటు ప్రధాన మంత్రిని, ఇటు పార్లమెంటరీ బోర్డు అధ్యక్షునికి కూడా ముద్రాధికారిగా పనిచేస్తారన్నమాట

అందువల్ల పదవీత్యాగం చేసి పార్టీద్వారా



మద్రాస్‌లో అమెరికాసమాచార కార్యాలయంలో శ్రీ థామస్‌క్లీవ్ లాండ్‌స్థానే వచ్చిన కొత్త 'కల్చరల్ అఫైర్స్ ఆఫీసర్' [యు ఎస్ ఐ ఏ ఎస్] డా॥ ఇగాన్—

దేశానికి సేవచేయటమనే కల కరిగిపోయి వారసత్వ పోరాటం అనే వాస్తవం దానిస్థానం ఆక్రమించింది

కేంద్ర మంత్రివర్గ పునర్నిర్మాణ విషయం ప్రధాన మంత్రి హృదయరహస్యంగానే ఉన్నా, పదవుల కోసం జరుగుతున్న పోరాటం మాత్రం అందరికీ స్పష్టంగా తెలుస్తోంది అయితే పదవీ పోరాటం అంతా ఆర్థిక, విదేశీ వ్యవహారాల శాఖల విషయంలో మాత్రమే ఇక్కడ శక్తి సామర్థ్యాల ప్రసక్తేలేదు ఎవరెక్కువ కాలంగా పనిలో ఉంటే వాళ్లని అనే—అంటే సీనియారిటీ— పద్ధతిన జరుగుతోంది ఈ దీర్ఘ కాలిక నిర్వహణం

**55 వ పేజీ చూడండి**

# సాధక బాధకాలు గుర్తించని విమానశాఖ

ఐ. ఎల్. ఎన్.

ఒకటే ముసురు, పట్టు విడవలేదు ఎడా తెపీ లేకుండా, పగలల్లా చినుకు రాలుతూనే ఉంటోంది రాత్రిళ్లు మాత్రం ప్రళయంగా కురుస్తోంది చాలా వరకు సిమెంటు రోడ్లే కనక వర్షపుధార తాకిడి పైకి అట్టే కనిపించటం లేదన్న మాటే గాని, పగలు పదిగంటల్నుంచి చూడాలి రోడ్లమీద ప్రజల ఆదుర్దా, ఏ బస్సు ఎక్కడ ఆగుతుందో తెలీదు ఎక్కడి నుంచి వస్తున్నా, ఏ స్టేజి దగ్గరకు రాబోతున్నా, బస్సుల్లో జనం కిక్కిరిసే ఉంటున్నారు ఆ రద్దీలోనే చోటు చేసుకుందామని, కొంత మంది ఉద్యోగస్థులు, బస్సుల వెంట పడుతూనే ఉంటారు ఒకళ్లిద్దరూ లోపలికి సాహసించి చొచ్చుకుపోయినా, రోడ్ల మీద నిలబడి పోవలసిన వారి సంఖ్య యెక్కువ ఒకరిమీద ఒకరు నిందలు మోపుతూ 'క్యూ' సిస్టాన్ని తెంపేశారు ఎవరికి వారే ఒక చిన్న 'క్యూ' లాగ తయారయినారు యాంత్రికంగా రోజులు దొర్లిపోతున్నాయి ఎవరి ప్రమేయం లేకండానే, అన్నీ వాటంతటవే సాగిపోతున్నట్లు కనిపిస్తున్నాయి ఎవరి గొడవల్లో వాళ్లు పడిపోయారు అందర్నీ నిద్రలేపి కర్తవ్యంపై దృష్టిని ప్రసాదింప చేసిన, ఆ చైనావాళ్ల దుండగీడుతనం, స్మృతి పథాల్లో మరుగు పడ్డట్టనిపిస్తోంది పేపర్లలో చూడబోతేనేమో, ఉత్తర సరిహద్దుల్లో శత్రువు భారీ ఎత్తుగా దండయాత్రకు సేనన్ని సమీకరిస్తున్నారు అని అంటుంది ఈ హెచ్చరిక ఎవరికో మరి ! ప్రభుత్వమే నిద్రపోతుంటే, మన మేంచేస్తామని ప్రజలు, ప్రజల్లో చైతన్యం లేకపోతే, మనమేం చెయ్యకలుగుతామని ప్రభుత్వం వారు అనుకుంటున్నట్లనిపిస్తోంది

విద్యార్థులకు నిర్బంధ సైనిక శిక్షణ అవసరమని గుర్తించి, ఈ అత్యవసర పరిస్థితుల్లో అలాంటి పథకాన్ని ఒకటి రూపొందించారు ఆంధ్రప్రదేశ్ రాజధానిలో కూడా దానికి ప్రారంభోత్సవం జరగటం, సికింద్రాబాద్ పెరేడ్ మైదానంలో అయిదువేల ఉత్సాహవంతులైన విద్యార్థులు, విద్యార్థినులు కూడా పాల్గొనటం జరిగింది ఇదొక చరిత్రాత్మక సంఘటనని, విద్యార్థులు చైనా దురాక్రమణను ఎదుర్కోవాలని, ముఖ్యమంత్రిగారు ఉద్బోధించారు మన రాష్ట్రంలో పరిపాలనా యంత్రాంగం సమర్థవంతంగా లేదని, ముఖ్యమంత్రిగారు ఇచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేక పోయారని సర్వత్రా విమర్శ ఉంది ఇక్కడ కాంగ్రెసు వ్యవహారాలు శ్రుతిమించి రాగాన పడుతున్నాయి పరిపాలనా సౌష్టవం కంటె, కాంగ్రెసు పార్టీ బలపడటమే ప్రధానమని యెప్పుడయితే అఖిల భారత కాంగ్రెసు పార్టీవారు అభిప్రాయపడ్డారో, అప్పటినుంచి తెరచాటు నాటకాలు, నేపథ్య సంగీతాలు యెక్కువవుతున్నాయి పదవులకై మళ్లీ పోటీలు ప్రారంభమయినాయి యావత్ ప్రజానీకం యొక్క దృష్టి వీటి వైపు ఇట్టే మరలి పోయింది మంత్రుల ప్రకటనతో సామాన్య మానవుడు ఉక్కిరి బిక్కిరయి పోతున్నాడు ఓ మూల ముఖ్యమంత్రిగారు బాహాటంగానే ప్రకటించి ఉన్నారు నేను ఈ పదవికి రాజీనామా ఇచ్చాను సంస్థను బాగు పరచటానికి సిద్ధంగా ఉన్నానంటూ, అబ్బో ! ఆయన దిగిపోతే ఇంకేమున్నా ఉందా, రాష్ట్ర క్షేమం దృష్ట్యా, ఆయనగారు ఇక్కడ ఉండి తీరాల్సిందే అంటూ మంత్రి వర్యులు ప్రకటనలు గుప్పించేస్తున్నారు నూటయాభై వేల ప్రాథమిక కాంగ్రెసు సభ్యత్వాలు చెల్లవని తీర్పు ఇవ్వటం జరిగింది ప్రదేశ కాంగ్రెసు యెన్నికలు వాయిదా వెయ్యబడ్డాయి కాని తగాదాలుగానే నిలిచి పోయినాయి వీటిని సర్దుబాటు చెయ్యటానికి, భారత రక్షణ మంత్రి చవాన్‌గారు హైదరాబాదు వచ్చేస్తారట ! ఈ అత్యవసర పరిస్థితుల్లో ఢిల్లీలో ఆయనగారు నిర్వహించాలసిన బాధ్యతల మాటేమిటి ! రాష్ట్ర కాంగ్రెసు రాజకీయాల ఒరవడిలోకి ఆయన్ను లాగటం సముచితమేనా ! బాధ్యతగల వ్యక్తులు ఇలాంటి పనిని ఒప్పగించ తగ్గదేనా ! చైనా దురాక్రమణ ప్రమాదం సమసి పోలేదు మనం తగు జాగ్రత్తలోనే ఉండాలని రోజూ చేసే ఉద్బోధనలకు, ఈ ఆగడాలకు, అల్లర్లకు సమన్వయం యేమిటి !

ఇక మామూలు సమావేశాల్లోన్నూ, శ్రద్ధాంజలులలోను, ప్రదర్శనలలోనూ ప్రజలు నిమగ్నులై పోతుంటే ఆశ్చర్య పడాలసిన పనిలేదు అవి కూడా నిజానికి అవసరమేనా ? అఖిల భారత చేతి వృత్తుల సలహా సంఘ సమావేశాలకు కావలిసినంత ప్రాముఖ్యం ఉంది పారిశ్రామికంగా ఇతర దేశాల దృష్ట్యా, యెక్కువ బలపడ లేకపోయిన మన దేశంలో చేతివృత్తులు, కుటీర పరిశ్రమలకు విశిష్టమైన స్థానం ఉంది జూబ్లీ హాలులో జరిగిన సమావేశంలో పలువురు ప్రముఖులు ప్రసంగించటం జరిగింది చేతివృత్తులద్వారా తయారైన వస్తువుల నాణ్యతను, మనుగడను, అభివృద్ధి చేయవలసిన అవసరము వాటి ఉత్పత్తి ఖర్చులు తగ్గించ వలసిన ఆవశ్యకతను గురించి ప్రస్తావించారు సాంప్రదాయ సిద్ధమైన చేతి వృత్తులను పునర్నిర్మాణం చెయ్యాలనీ, ఉత్పత్తి అయిన వస్తువులకు దేశ వ్యాప్తంగా మార్కెట్టు సౌకర్యాలు కల్పించాలని సూచనలు చేయటం జరిగింది లఘు పరిశ్రమల అభివృద్ధికి ప్రభుత్వం వారు కొంత ఆర్థిక సహాయం కూడా చేస్తూ వస్తున్నారు కాని ఈ పరిశ్రమల నిర్వహణలో తీవ్రమైన లోపాలు కనిపిస్తున్నాయని డబ్బు ఇవ్వటంతోడనే, ప్రభుత్వంవారు తమ బాధ్యత తీరిపోయిందని మూకీభావం వహించక, వాటి సమర్థవంతమైన నిర్వహణకు కూడా తగు చర్యలు తీసుకోవలసి ఉంటుందని, ఆ సమావేశంలోకి వచ్చిన ఒక పెద్దమనిషి అన్నాడు చేతి వృత్తులకోసం, మన రాష్ట్ర ప్రభుత్వం 25 లక్షల రూపాయలు కేటాయించింది కాగితాల మీద కేటాయింపులూను, ఇచ్చిన అప్పు పద్దులూ కనబడుతున్నాయే గాని, వాటి తాలూకు పరిశ్రమలెక్కడా అనుకున్న స్థాయిలో అభివృద్ధి పొందటం లేదే అని ఇంకో పెద్దమనిషి నిస్పృహ పడ్డాడు

అన్నట్టు ఓ ముఖ్యమైన సమస్య ఉత్పన్నమయింది ఉన్నట్టుండి 700 మంది కుటుంబాలు ఒక్క పెట్టున, అమాంతం బొంబాయి తరలి వెళ్లాలసిన అగత్యం ఏర్పడ బోతోంది రాజధానిలో ఎన్నో ఏళ్ల బట్టీ అంటి పెట్టుకు ఉంటూ, ఈ ప్రదేశానికి అంకితమయిన జీవితపు పునాదులు కదులుతున్నాయి వీళ్లే భారత విమానశాఖాధిపత్యానికి సంబంధించిన కర్మాగారంలో, పనిచేస్తున్న ఇంజనీర్లు, గుమాస్తాలు, కార్మికులు, ఇతర నిపుణబృందమూ 'ఇంజనీరింగ్ బేస్'ను బేగంపేటనుంచి ఎత్తేసి బొంబాయికి తీసుకు వెళ్లాలనే ఇంజనీరింగ్ ఎయిర్‌లైన్స్ కార్పొరేషన్ వారి అభూయిత్యపు చర్యకు గురి కావలసిన ఈ బృందం యొక్క అగచాట్లు వేరే చెప్పక్కర్లేదు ఎక్కడ హైదరాబాదు, ఎక్కడ బొంబాయి, వీళ్లందర్నీ అక్కడకు రమ్మనటంలో కార్పొరేషన్ వారు సాధించిందేమిటి ? వీళ్లందరికీ పునరావాసకల్పన, చదువులలో అంతరాయం, మానసిక బాధ, బొంబాయి లాంటి పట్టణంలో, ఈ తక్కువజీతాల్తో సరిపుచ్చుకోవాల్సిన అవసరం, ఇవన్నీ సమస్యలేగా ! ఇంతకీ ఇలాంటి నిర్ణయానికి కారణమేమిటి !

విమానాల కంపెనీలను జాతీయం చెయ్యటానికి పూర్వం, మొత్తం 1200 మంది దాకా బేగమ్‌పేట వర్క్‌షాపులో పనిచేస్తూ ఉండేవాళ్లు అప్పట్లో పేరు డక్కన్ ఎయిర్‌వేస్ లిమిటెడ్ అయితే క్రమక్రమంగా ఇక్కడి సిబ్బందిని, ఇతర చోట్లకు బదలాయింపు చేస్తూ 700 మందిదాకా తీసుకు వచ్చారు ఇక్కడ వర్క్‌షాపులో 'డకోటా'లకు సంబంధించిన పనే అతి సమర్థవంతంగా నిర్వహింప బడుతోంది బొంబాయి ప్రాంతానికికూడా, ఇక్కడి నుంచే 'డకోటా'లకు సంబంధించిన సప్లయి జరుగుతూ వస్తోంది అలాంటప్పుడు బేగమ్‌పేట 'బేస్'ను ఇంకా అభివృద్ధి పరచాలసింది పోయి, అసలే ఎత్తివేద్దామని ప్రయత్నం చేస్తున్నారు 'డకోటా'లు (క్రమ క్రమంగా తీసేసి ఇప్పుడున్నవి 43 మాత్రమే) వాటి స్థానే 'ఫోకర్ ఫ్రెండ్‌షిప్' విమానాలను ప్రవేశ పెడుతున్నారు అలాంటప్పుడు ఫోకర్ ఫ్రెండ్‌షిప్'కు సంబంధించిన వర్క్‌షాప్ బేగమ్‌పేటలో ఉంచకుండా ఇక్కడ ఉన్నది యెత్తేసి, బొంబాయిలోనే లక్షరూపాయలు వెచ్చించి తేని 'ఓవరాల్ బేస్'ను సృష్టించటానికి ప్రయత్నిస్తున్నారు దీని మూలంగా ఆంధ్రప్రదేశ్‌లో విమానాలకు సంబంధించిన పరిశ్రమకు రూపు రేఖలు లేకుండా పోతుంది పరిశ్రమల వికేంద్రీకరణ సిద్ధాంతానికి ఇదొక గొడ్డలిపెట్టు ఇప్పటి అత్యవసర పరిస్థితుల దృష్ట్యా, విమానాలకు సంబంధించిన, కర్మాగారం, దేశం మధ్యలో ఉన్న హైదరాబాదులోనే ఉంచటం, రక్షణ దృష్ట్యా కూడా సమర్థనీయం

పైగా, తెలుగు విద్యార్థులు, ఏ యమ్ ఐ ఈ లాంటి పరీక్షలకు వెళ్లాలంటే, ఇప్పుడున్న కర్మాగారంలో శిక్షణ పొందటానికి అవకాశం ఉంది బేగమ్‌పేటలోంచి ఈ బేస్‌ను రద్దు చేసే సందర్భంలో, ఈ విద్యార్థులకు ప్రాక్టికల్

55 వ పేజీ చూడం



# సరాగమాలు

వి. ఎ. కె. రంగారావు

జోస్యుల సూర్యనారాయణశాస్త్రి ప్రస్తుతము బొబ్బిలిలో ఉంటున్న సంగీత విద్వాంసులు. శ్రీ ఆకుండి నారాయణశాస్త్రిగారి శిష్యులు. బొబ్బిలి సంస్థాన సంగీత విద్వాంసులుగా కొన్నేళ్లు ఉన్నారు అప్పటి వారి కార్యక్రమం రాజావారి పూజామహల్లో రోజూ ఒక కీర్తన, ఒక మంగళం పాడటం రెండేళ్లపాటు బొబ్బిలి కుమారరాజా వారికి వాయులీనం కూడా నేర్పేరు ఈ వాద్యంతో బాటు వీణావాద్యంలో కూడా వీరికి నేర్పు ఉంది కాని వీరికి పేరు ప్రతిష్ఠలు ఆర్జించిపెట్టినది వారి గాత్రమే గాని వేరొకటి కాదు వీరికి సాహిత్య రంగంలో కూడా అభినివేశం ఉంది స్వయంగా కొన్ని కృతులు, కొన్ని నుతులు, రెండు, మూడు వర్ణాలు, ఒక తిల్లానా, సంగీత పరమైన ఒక అరవింద పద్యాలు రచించారు. రెండు వర్ణాలు, ఒక లలితరాగ పంచతాళ లక్షణ గీతం యిటీవల శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి మాసపత్రికలో ప్రచురింపబడినవి

ఆమధ్య వారిని కలుసుకున్నప్పుడు శేఖర చంద్రిక అనే అపూర్వ రాగంలో 'నీవేగతి జగతిలోన', కన్నడ రాగంలో తిల్లానా, ఉదయ రవిచంద్రిక లక్షణ గీతం, అన్నీ తమ స్వంత రచనలే, పాడి వినిపించారు ఒకోదాని అందం ఒకోదానికి అమరినా, ఆఖరిది యెన్నో విధాల అందం సంతరించుకున్నది హిందోళరాగం గురించి వారు వ్రాసిన పద్యం క్రింద యిస్తున్నాను రాగ మెంత చక్కనిదో రచనా అంత చక్కగానే ఉన్నది

సీ. ఇంపుమీరగ బాడ హిందోళ రాగంబు
    శ్రవణ సౌఖ్యము గల్గు శ్రోతలకును
రాగలక్షణ మరయ రమ్య కోమలధ్వనులు
    జనక నఠభైరవి జన్య మనగ
ఆరోహణావరోహణాది మూర్ఛనబట్టి
    ఔత్తరీ షాడవ ఔడవం బనగ
గాంధార భేదమున శుద్ధ సావేరియు
    మధుర మధ్యమ భేద ముదయరవి
        యనగ

గీ. ముదము దైవత భేదంబు మోహ నవగ
అరసి నిట్టు లక్షణం బెరిగియున్న
శక్తి గల గాయకుడు శాస్త్రబద్ధముగ
రక్తి జూపును హిందోళ రాగమందు

*  *  *

ఎన్ 69719 చివరకు మిగిలేది

పై చిత్రంలో పాటలు పరిచయం చేయమని పాఠకులు పదేపదే కోరుతున్నారు రెండు కొలంబియా రికార్డులు, అవి విడుదలయిన కొత్తలోనే పరిచయం చేశాను ఘంటసాల పాడిన రెండు పాటలు పై హెచెంవి రికార్డులో ఉన్నవి ఇంత వరకు వాటిని సమీక్షించక ఉపేక్షించిన కారణం ఉంది సుశీల, జమునారాణి, ఎమ్మెస్ రామారావు, సునంద పాడిన తక్కిన నాలుగు పాటలు అశ్వధామ స్వయంప్రభ జనితాలు ఘంటసాల పాడిన రెండు పాటల వరుసలు, ''చివరకు మిగిలేది'' చిత్రానికి వంగ మాతృకయిన ''దీప్ జలే జాయ్'' లో హేమంతకుమార్ వినిపించిన వరసలకు నకళ్లు అంతమాత్రాన బాగులేవని కాదుగాని ఎంతయినా సూర్యుని నిజప్రకాశానికి, అద్దంలోని ప్రతిబింబానికి తేడా ఉంటుందికదా ? అదే సంగతి

ఒకప్రక్క మల్లాది రచన "సుధవోల్ సుహాసినీ'' అన్నది ఇందులో పాట కెంత ప్రాముఖ్యత ఉందో, దానితోబాటు లంతర్వాహినిగా ప్రవహించిన ఈలకూ ఉంది ఇదే వరస, ఆంగ్లభాషలో 'సిగ్నేచర్ ట్యూన్' అంటారు చిత్రమంతా టైటిల్స్ దగ్గర నుంచి చివర నున్న 'చివరకు మిగిలేది' దాకా వినిపిస్తుంది ఈ పాటలో, వరసలు, వాద్యగోష్ఠిలో ధ్వనించే నిశ్శబ్ద సౌందర్యానికి మరింత మెరుగులు దిద్దినది మల్లాది కలం వరస ముందు నిర్ణయించినదైనా, ఆ మాటల తీరు గమనిస్తే వారికి భాషపై నున్న అధికారం బోధపడుతుంది

రెండవప్రక్క కొసరాజు రచన "అయినవారు నా కెవరు'' సగం సగం నిషాలో, సగం విషాదం, సగం హాస్యం ఎలా కలుస్తాయో కత్తిలాగ చూపించారు

## నామరూపాలు - 15



ఇందులో కూడ మాటలు చక్కగా వికృతమైన విరుపులు లేకుండా అమరినవి. రెండు పాటల్లోను ప్రత్యేకత ఘంటసాల పాడటం. ఎంత కమ్మదనం! ఎంత తీయందనం? చెట్టున పండిన జహంగీర్ మామిడి. ఆరమగ్గిన చక్కరకేళి, వెన్నవేసిన బంగారుతీగ చెరకుముక్క. ఆ గాంభీర్యం, ఆ మృదుత్వము, ఆ కంఠంలోనే వినపడతాయి. అందుకే ఆంధ్రులకు ఆ కంఠమంటే అంత మోజు.

ఈ పాటలను హేమంతకుమార్, మన్నాడే వంగభాషలోనే పాడగా వినాలనుకున్నవారు జి. ఇ. 30424 ఆర్డరివ్వండి. భాష తెలియకపోయినా తేషనిపించుకోగలవు పాటలివి రెండూ! ★

# అవీ - ఇవీ - అన్నీ

## సెట్టుమీద మర్మయోగి

అదొక గుహ. దానిండా కత్తులు, బల్లెములు, డాళులు, బాకులు ఉన్నాయి. ఆ గుహ ప్రభాకర్‌ది. ప్రభాకర్‌ను లొంగదీసుకొనడానికి విశ్వప్రయత్నాలు చేస్తుంది ఆ దేశపు మహారాణి. సేనాధిపతి భాస్కర్ సోదరి అయిన ప్రభావతిని ప్రభాకర్ దగ్గరకు పంపిస్తుంది. ప్రభాకర్‌ను ప్రేమించమంటుంది. మోహించమంటుంది తన వశం చేసుకోమంటుంది. అలా అని నటించి - మోసగించి— వంచించి తనవశం చేయమంటుంది మహారాణి.

ప్రభాకర్‌ను మోసగించడానికి వెళ్లిన ప్రభావతి— ప్రభాకర్‌వలలో పడుతుంది. తనే మోసపోతుంది.

ఈ విషయం భాస్కర్‌కు తెలుస్తుంది. తన సోదరి ఎటువంటి ఆపదలో ఉన్నదో అని చింతిస్తాడు. మధన పడతాడు. బాధ పడతాడు. తన సోదరిని విడిపించడానికి వెళ్తాడు.

తన సోదరి ప్రభావతి ఉన్నది ఆ ప్రభాకర్ గుహలోనేగా! గుహలో ప్రవేసిస్తాడు. ప్రభాకర్— భాస్కర్‌ల కత్తియుద్ధం — బాకుల యుద్ధం, చివరకు ముష్టి యుద్ధం కూడా జరుగుతుంది.

ఈ సన్నివేశాన్ని జూపిటర్‌వారి "మర్మయోగి" చిత్రం కొరకు చిత్రీకరించారు.

"నవ్వుల నదిలో పువ్వుల పడవ. . . . ."

పై పాటను ఆరుద్ర వ్రాయగా— పి. లీల పాడగా రికార్డు చేయబడింది. లీలావతితో చిత్రీకరించారు.

"చోద్యం చూశావా! చుక్కల వెలరాజా!"

పై పాట కూడా ఆరుద్రచే వ్రాయబడింది. సుశీల పాడగా రికార్డు చేశారు. కృష్ణకుమారితో చిత్రీకరణ జరిగింది.

"ఎందుకు పిలిచితి ఓ— రాజా. . . .
అందాల పొందుకో— వేరెందులకో"

ఈ పాటను కూడా ఆరుద్ర వ్రాశారు. జమునారాణి— ఏ. పి. కోమల అండ్ పార్టీ పాడగా రికార్డు చేశారు. శకుంతల— కౌసల్యలతో చిత్రీకరణ జరిపేరు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, గుమ్మడి, కాంతారావు, ఏ. వి. సుబ్బారావు (జూనియర్), చదలవాడ కుటుంబారావు, బాలకృష్ణ, కృష్ణకుమారి, లీలావతి, మీనాకుమారి, సాధన

56 వ పేజీ చూడండి



"మంచిరోజులు వస్తాయి"లో జమున, కాంతారావు.



కొత్తనటి సరస్వతి [ఫొటో : ప్రభాకర్.]

వీరాజీ

## జరిగిన కథ

వాల్తేరులో ఎమ్ ఏ కు అప్లికేషన్ పెట్టి తిరిగి వస్తున్న పద్మావతిని కలుసుకోడానికి భాస్కరం స్టేషనుకు వెళ్లాడు పద్మతోబాటు ఆమె క్లాస్‌మేట్ సురేఖ కూడా విజయవాడ స్టేషన్‌లో దిగుతుంది సురేఖకు భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది పద్మావతి భాస్కరం సవతి తల్లి జానకమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది భాస్కరానికీ, కూతురు వసంతకూ వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్లిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది పెళ్లికూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం, ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తన భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు చివరకి భాస్కరం తన పెళ్లి వాయిదా వేస్తాడు ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు సురేఖ, పద్మ యిద్దరూ ఎం ఏ లో చేర్తారు భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తిచేయటానికి వస్తాడు పద్మావతి భాస్కరం ప్రవర్తనలో ఏదో మార్పు కలిగినట్లు అనుమానిస్తుంది భాస్కరం తన అంతస్తుకు తగ్గ సురేఖనే చేసుకుంటాడేమో నన్న అనుమానంతో బాధ పడుతూ ఉంటుంది దానికి తోడు భాస్కరం గూడా చెల్లెలికి సమ్మంధం నిశ్చయం చేయడానికి తన వూరు వెళ్తూ సురేఖకే ఫోనుచేస్తూ తనతో చెప్పమనడం పద్మకు మరింత అనుమానానికి అవకాశ మిస్తాయి పద్మావతి భాస్కరం కన్పించినా సరిగా మాట్లాడదు దీనికి కారణం సురేఖ అంతా చెప్పేఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు భాస్కరం కాని పద్మావతి అతనికి మాట్లాడ్డానికి కూడా అవకాశం ఇవ్వదు అనసూయతో భాస్కరం స్నేహితుడు మూర్తి శైలజను ప్రేమిస్తాడు శైలజ కూడా పద్మవతికు సురేఖకు స్నేహితురాలు

## 31

ఎమ్మెస్సీ కుర్రాళ్లు, రీసెర్చిచేసే అబ్బాయిలూ వీళ్ళకి సమైక్యతా సిద్ధాంతాలు, వాటి అవసరం బాగా తెలుస్తుందేమో నన్నట్లు ఒక "కిర్లంపూడి బంగళా" అనే దాన్ని ఇప్పుడా హాస్టలులో ఉంటోన్న విద్యార్థులకు తెలియనంత పాత కాలంనించీ వసతి గృహంగా ఇచ్చారు విశ్వవిద్యాలయం అధికారులు

ఈ భవనం సముద్రంకేసి చూస్తూ ఉంటుంది ఇందులో కాశీమజిలీ కథలో ఎన్ని మలుపులు ఉంటాయో, ఆధునిక యువకుల ప్రేమలో తెనుగు సమాజంలో ఎన్ని ఇబ్బందులుంటాయో అన్ని గదులున్నాయి అన్ని రకాల మెట్లున్నాయి. అచ్చం పైన పేర్కొన్న ఆ కథల లోని మలుపుల్లో ఎంత 'థ్రిల్' ఉందో—ప్రేమకు కలిగే ఆటంకాలలో ఎంతో "వెంచర్" ఉందో అంత హాయిగానూ ఉంటుంది ఈ హాస్టలు జీవితం

దారి కటూ, ఇటూ నల్లని, నున్నని బండలు, వాటికి అలంకారప్రాయంగా అల్లి బిల్లి క్రీపర్లు అల్లుకున్నాయి వాటికి అందంగా చిన్ని చిన్ని పూలు విడ్డాయి వాటికి దూరంగా దిగువగా చిన్నా చితుకు దుబ్బులు దాటుతూ పోతే కావల్సినంత సముద్ర ముంటుంది

మాంత్రికుడు రాజకుమారికోసరం ఒకసారి ఒక కథలో ఒక ఒంటి స్తంభం మేడను—ఒక సముద్రంలో కట్టినట—కాని ఈ కోటలాంటి మేడను సముద్రం ఒడ్డున విద్యార్థుల కని కేటాయించారు

గదిలోనించి గది, హాలులోనించి హాలూ ఒకరి రూమ్‌లోనించి మరొకరి గదిలోకి దారీ

"పెద్దమర్రిచెట్టు, దానిమీద నాలుగు దిక్కుల నించి పక్షులు వచ్చెను గూళ్లు కట్టుకొనెను" అన్నట్లుంటాయి

అయితేనేం భాస్కరం అంటాడు

"ఈ సముద్రం, ఈ ప్రకృతి రామణీయకత ఇవి చాలవూ—హాస్టల్ అన్నంలో రాళ్ళుంటేనేం సాంబార్‌లో కెంపులుంటేనేమ్! ఫర్వానై"

నేరుగా మంచాలు, మనుషుల్నీ దాటుతూ, తనది అనుకునే మంచం, అల్మారా, పెట్టే ఉన్న జాగాలోకి వెళ్లిపోయాడు వాళ్ల 'రూంమేటు' అన కూడదు భావ్యం కాదు కాని, వాళ్ల 'నైబర్' (పొరుగు) అప్పుడే భోజనం చేసి వస్తూన్నాడు.

"బ్రదర్ భాస్కర్! నీ మంచం క్రింద దాచిన ఆవకాయ వుంది చూసావ్?" అన్నాడు మిత్రుడు

మంచంమీద కూలబడి, 'ఔను! నేనే తెచ్చాను" అన్నాడు భాస్కరం

"అదీ దాని కమ్మని వాసన ఈ జిహ్వా రాముణ్ణే గొప్ప ప్రలోభనకు లోను జేసిందిసుమా అందుకనీ నేనూ దొంగతనం చేశాను ఒక ముక్కా కాస్త వూటా మాత్రం థాంక్స్ టు యూ"

"హే! భగవాన్! ధనమ్మగా రన్నంతపనీ అయింది" భాస్కరం మంచాన వెల్లకితలా పడ్డాడు.

"ఏమయింది బ్రదర్! ఏమేనా కొంపలు మునిగే పని జేసేనా?" మిత్రుడు కాస్త గాభరా పడ్డాడు

"కావాలంటే నా చింతకాయ పచ్చడి నీకు స్వయంగా వేస్తాను పద మెస్సుకి బ్రదర్" అన్నాడు

"మై గుడ్నెస్! నీ చింతకాయ పచ్చడికేం? బ్రదర్! ఉండనీ గాని అది మన సొంతావకాయ కాదు ఓ ధనమ్మగారు అనే దొడ్డమ్మగారు. తన ముద్దుల పట్టికి యివ్వమని పంపించిన పొరుగింటి పుల్లకూర"

"ఓ! అయామ్ సారీ! పోనీ ఆవిడ ముక్కలు లెక్కపెట్టిం దంటావా? పెట్టిఉండదు—అథవా పెట్టిందే అనుకో యువతల బట్వాడా తీసుకోనే శాస్త్రీకి ఆ సంగతి తెలీదుగా" నొచ్చుకుంటూనే అన్నాడు 'నైబరు'

"అఫ్‌కోర్స్! అదీ రైటే ఓకే!" అన్నాడు భాస్కరం నవ్వుతూ

మిత్రుడు అడిగాడు "ఇవాళ నువ్వు డల్‌గా ఉన్నావు కారణం?"

"లేదే! ఎగ్జిబిషన్‌లో కాస్త రష్ ఎక్కువగా ఉందీ అంతే" నన్నాడు భాస్కరం

"ఓ చెస్ ఆట వేద్దామా?"

"పోనిద్దూ! ఆర్గానిక్ కెమిస్ట్రీ నోట్స్ రాయాలి" అన్నాడు భాస్కరం

మిత్రుడు బోర్డూ, పిక్కలూ తీసుకు ప్రక్కనున్న వరండాలోకి వెళ్లిపోయాడు ఒక్కడే ఆడేసుకోగల డతగాడు!

"నాపని చెదరంగం పిక్కలాగే ఉంది ఎవరెటు నప్పుతారో నన్ను నాకే తెలియదు" భాస్కరం నిట్టూర్చాడు

"ఏమైనా సరే! నేను పద్మావతికి కథంతా చెప్పలేను ఆ అమ్మాయి చదువు మానేస్తుంది .." అనుకున్నాడు

* * *

అలా భాస్కరం అనుకున్న దానిలో తప్పేమీ లేదు అప్పటికే పద్మావతి పదిసార్లు "తిరిగి గుంటూరు



పోతాను అమ్మతో బియ్యేడీ చదువుకుంటానని చెబుతాను" అనుకుంది

భాస్కరం ఎందుకనో తనకు దూరమై పోతున్నాడు తను బీదదైనందువల్లనే నేమో. లేదా తనకు ఒక్క తల్లి తప్ప మగదిక్కు ఎవ్వరూ లేరు సమాజంలో చెప్పుకునేందుకు పెద్ద హోదాగల తండ్రీ, తాతా, మావయ్యా, అన్నయ్యా ఎవ్వరూ లేరు—ఒక ఆడది ‹ వ సొంత రెక్కలమీద పోషిస్తున్న మరో ఆడపిల్ల తాను—రేపు తనకూ తల్లికీ, కూడా యీ చదువైన తరువాత ఉద్యోగం చేయడమూ చేయించడమూ రెండూ తప్పక పోవు

భాస్కరం సంప్రదాయాలున్న కుటుంబం లోనించి వచ్చాడు అతను అతని ఆత్మీయులు అతని అంతస్తూ, ఈ రెంటినీ హద్దులుగా ఒక సమ్మంధం చూసుకుంటాడు—బహుశ అందుకు ఏ సురేఖలాంటి అమ్మాయో—చదువుకొనడం కేవలం చదువుకోసరమే చేసేది సరిపోతుంది—అనుకుంది పద్మావతి

ఈ ఆలోచన మధ్యకు కేవలం సురేఖను ఎందుకు తేవాలో తనకే తెలియదు—భాస్కరం ప్రవర్తన పద్మావతికి ఎందుకనో బాధ కలిగి

40 వ పేజీ చూడండి

# పంజాబీల పరిణయం

## యం. సుగుణ

మన దేశంలో చాలా రకాల భాషలు, దానికి అనుగుణంగా, మతం, ఆచార వ్యవహారాలూ ఉంటాయన్నది అందరికీ విదితమే ! వివాహమనేది అన్ని జాతుల వారికీ ఉన్న శుభకార్యం కాని ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వివాహం జరిపిస్తారు అందులో పంజాబీల వివాహం కొంచెం తమాషాగా ఉంటుంది ముందు పెళ్లి చూపుల దగ్గర్నుంచి చెబుతాను !

పెళ్లి చూపులకని వధువుని చూడటానికి వరుని అక్క చెల్లెళ్లు మొదలగు పెద్దలు వచ్చి స్తారు వరుడు సాధారణంగా వధువుని చూడకూడదు తల్లి దండ్రులకి నచ్చితే చాలు కాని ఈ రోజుల్లో కొంతమంది ఫోటో చూడటమో, లేక ఇరు పక్షాల వారూ ఒప్పుకుంటే పెళ్లి చూపులు ఏర్పాటు చేస్తారు అదయినా బాగా కలువుగోలుగా తిరిగేవారు మాత్రమే ! ఇంక పెళ్లి చూపులలోం మొదటి ప్రశ్న ఏం చదివావు ? తరువాత కుట్లు అల్లికలూ ఇంక ఎన్ని కుట్లు, అల్లికలూ తయారు చేసిందో చూపిస్తారు ఈ కుట్లూ అల్లికల పనితనం ఎంత గొప్పగా ఉంటే అంత మంచిది తనకి (వధువుకి) పెళ్లికి కావలసిన బట్టలూ, టేబిల్ క్లాతులూ బెడ్ షీట్లూ, టీపెట్టుకి కావలసిన చిన్న నేప్‌కిన్సూ, టీకోజీ ఇలా అన్నీ స్వంతంగా ఎంబ్రాయిడరీ చేసుకుంటుంది ధనవంతులయితే సోఫాసెట్లు అవీ అమ్మాయికిస్తే, వాటికి కావలసినవన్నీ చిన్న దిండ్లూ వాటి కవర్లూ అన్నీ చేత్తో కుట్టి ఉంచుతుంది బట్టలు పిల్లకి పెట్టినవి సెట్లు క్రింద ఇస్తారు

మనలో మీ కోడలికి ఏం పెట్టారు ?' అని అడిగినట్టే ఎన్ని సెట్లు ఇచ్చేరు ? అనడుగుతారు చీరె జాకెట్లు లోపలి లంగా అన్నీ ఒకే రంగు సెట్లు తమ అంతస్థుని బట్టి మూడు ఐదు ఏడు సెట్లు చొప్పున ఇస్తారు చీరెలు కొన్ని సల్వార్లు, కమీజులు, పైన చున్నీలు, అన్నీ ఒకే రంగులో ఇస్తారు ఇంక నగలు కూడా సెట్లే నెక్లెసు గాజులు చెవుల జూకాలో, రింగులో, లోలక్కులో, ఉంగరం, ఉన్న సెట్లు ఇవి కూడా తాహతునిబట్టి ఒకటో, రెండో ఇస్తారు. ఇంక దిండు గలేబులు దుప్పట్లూ, 'నేప్‌కిన్సూ' అవీ రెండో మూడో సెట్లు ఇస్తారు. పెళ్లినాడు వధువు కట్టుకునే బట్టలు శుభ సూచకంగా ఎర్రటి సెట్టు ఉంటుంది. దాన్నిండా చెమ్కీతో అంచులో చుక్కలో పువ్వులో కుట్టారు.

పంజాబీలలో ఉన్న తమాషా ఏమిటంటే మన ప్రక్క ఇంట్లో పెళ్లవుతోం దనుకోండి. ఏ రోజు పెళ్లో ఆ రోజు వరకూ మనకు మనకి తెలియనే తెలియదు. పెళ్లికిముందుగా స్త్రీలు సంగీత్ అని పిలుస్తారు. అదయినా సాధారణంగా రాత్రులు ఉంటుంది. ఆ రాత్రంతా ఆడవాళ్లంతా డోలు వాయిస్తూ పాటలు పాడు తుంటారు. వధువు మాత్రం మనలాగే సామాన్య దుస్తులు వేసుకుని అందరి మధ్య కూర్చుంటుంది.

అందరూ ఒకటో రెండో రూపాయలు, లేక చిల్లర డబ్బులు వధువుకి దిగతుడిచి పెళ్లి కుమార్తెకే ఇస్తారు. ఈ పాటలని బట్టి ఏదో శుభకార్యం అనుకోవాలి. ప్రతీ శుభకార్యానికీ 'సంగీత్' ఉంటుంది. (మాకోసారి ప్రక్కింటామె వచ్చి 'ఆజ్ హమారే ముండాకా ముండనే హై' అని పిల్చింది. మాకు అర్థమే అవలేదు. మళ్లీ అడిగితే 'ముండా' అంటే అబ్బాయి "ముండనే' అంటే పుట్టు వెంట్రుకలు అని తెలిపింది. వాళ్లబ్బాయికి పుట్టు వెంట్రుకలు తీస్తారుట ! (అప్పుడు కూడా సంగీత్ ఉంటుంది) ఈ పాటలు మగ పెళ్లి వారింట్లోనూ, ఆడపెళ్లి వారింట్లోనూ కూడా ఉంటాయి.

ఈరోజు రాత్రి పెళ్లనగా వాకిట్లో ఇంటిముందు పెద్ద షామియానా వేస్తారు. మన పందిరి మాదిరి.

వధువుకి ఎర్రని దుస్తులు వేసి కురులు చక్కగా దువ్వి ముడివేస్తారు. పెళ్లిరోజునే మొట్టమొదట పువ్వులు తలలో పెడ్తారు. పెళ్లికాక ముందు పువ్వులు, పెట్టుకోకూడదు. చాలా మంది బొట్టు కూడా పెట్టుకోరు. ఈరోజుల్లో అవన్నీ ఎక్కువ పెట్టడంలేదు కొందరు బొట్టు, కాటుక పెదవులకి లిప్‌స్టిక్ పెట్టారు ముందురోజు చేతులకి మెహెందీ (గోరింట) పెడతారు నగలన్నీ పెట్టి తలపైన ముఖం కనిపిం



జర్మనీ చరిత్రలో శ్రీమతి మేరీ ఎలిజబెత్ లాడర్స్ (పి.హెచ్.డి.) సువర్ణ శకాన్నే ప్రారంభించింది. సాంఘిక, రాజకీయరంగాల్లో హక్కులనేవి లేకుండా, క్రుగ్గుతున్న స్త్రీ జాతిలో చైతన్యాన్ని కల్గించి, ఉద్యమాన్నీ నడపటమే కాకుండా, ఎన్నో క్లిష్ట సమస్యలను నిర్భీతితో ఎదుర్కొని స్త్రీకి పురుషునితోబాటు సమాన హక్కులను సాధించిందామె ఇటీవలే ఆమె ఎనభై ఐదవ జన్మదినోత్సవ చేసకుంది

కుండా ముసుగు వేస్తారు. చేతులకి దంతంతో చేసిన ఎరుపు, తెలుపు రంగులలో గాజులు ఎక్కువగా మోచేతి నుండి పెద్ద చిన్న ప్రకారంగా వచ్చేటట్లుంటాయి ఆ గాజులు. ఆ గాజులు సంవత్సరం ఉంచుకోవాలిట. ఇక మగ పెళ్లివారికి ఘనమైన స్వాగతం ఇచ్చేందుకు ఎదురు చూస్తుంటారు.

అక్కడ మగపెళ్లివారు ఆడ పెళ్లివారింటికి వెళ్తారే దానికి 'బరత్' అంటారు అది ముఖ్యం. పెళ్లి కొడుకి బాగా ముస్తాబు చేసి తలకి పాగా చుట్టి ముఖం కనిపించకుండా పాగా క్రింద నుండి పువ్వుల దండలు, మధ్య చెమ్కీతో ఉన్నవి వ్రేలాడ దీస్తారు. నిజ్లలో వింతేమిటంటే ఈ బరత్‌తో స్త్రీలు వెళ్లరు. ఆఖరికి తల్లి కూడా వెళ్లదు. ప్రత్యేకంగా ఆడపెళ్లివారు బరత్‌తో రమ్మని స్త్రీలని పిలిస్తే ఇష్టం ఉంటే వరుని అక్క చెల్లెళ్ల వెళ్తే వెళ్తారు. కాని తల్లి మాత్రం వెళ్లకూడదట ఎందుకంటే కోడలు గృహలక్ష్మి కదా! లక్ష్మి వచ్చేసరికి తలుపువేసి ఉండకూడదు. ఎదురుగా అత్తగారు రావాలట. ఈ బరత్‌తో మగవాళ్లు, పిల్లలు వెళ్తారు. పెళ్లి కొడుకుని అలంకరించి గుర్రం మీద కూర్చోబెట్టి బేండుతో ఆడ పెళ్లివారింటికి వెళ్తారు. వరుడు కూర్చునే గుర్రానికి కూడా మెడలో గిల్టు నగలు, తోకదగ్గర మసీదుకుండే బురుజుల్లాగా ఆభరణం, తలకి కూడా చాలా నగలు పెట్తారు. వీపు మీద చక్కని జీను వేస్తారు. వూరేగింపు గుర్రం కూడా చక్కగా బలిష్టంగా నిగనిగలాడుతూ రీవిగా ఉంటుంది. గుర్రం మీద పెళ్లికుమారుడు కూర్చుంటాడు. పెళ్లికుమారుని వెనకో ముందో తోడి పెళ్లి కొడుకుగా చిన్న అబ్బాయికి కూడా చిన్న తలపాగా చుట్టి గుర్రంమీద కూర్చో పెట్తారు. ఆడ పెళ్లి వారింటికి ఈ వూరేగింపు వెళ్తుంది.

గుర్రంమీద వూరేగుతున్నప్పుడు మఖ్‌మల్ గొడుగు చుట్టూ పూసలు చెమ్కీలతో కుట్టిన గొడుగు పట్టుకుని వరుని ప్రక్కగా ఒకడు నడుస్తుంటాడు ఆడ పెళ్లివారింటి కెళ్లాక వరుడు గుర్రందిగి వధూవరులు ఇద్దరూ పూల మాలలు వేసుకుంటారు. అక్కడే అందరి పెద్దల సమక్షంలో లగ్న పత్రిక చదువుతారు తరువాత ఏర్పాటు చేసిన షామియానాలో అందరికీ విందు భోజనం. విందు అనంతరం వధూవరులు అగ్నిహోమం ముందు పండిత్ (పురోహితుడు) మంత్రాలు చదువుతుండగా ప్రదక్షిణ చేస్తారు. పెళ్లి తంతు, మనలాగా అట్టే ఉండదు.

రాత్రి పెళ్లనుకోండి ఉదయాన్నే వధువుని ఒక్కర్తినీ తల్లిగానీ మరే తోడులేకుండా భర్తతో అత్తవారింటికి పంపేస్తారు మనలో అప్పగింతలు అంటామే దానిని 'విదా' అంటారు. పెళ్లి కుమార్తెను అత్తవారింటికి పంపేటప్పుడు ఆమెకి ఇవ్వవలసిన సారెంతా ఆమెతోనే పంపేస్తారు. ఆమెని పంపే కారుకి పువ్వులతో అలంకరించి బేండు మేళంతో తీసికెళ్తారు. కానీ, ఆమె వెళ్లేటప్పుడు మాత్రం పెళ్లికూతురుతో సహా ఆడ పెళ్లివారింట్లో అందరూ, అంటే పేరంటాండ్రూ అందరూ గొల్లున ఏడుస్తారు. మగవారు కూడా ఏడుస్తారు. వధువు కారు ఎక్కేముందు అందరినీ కౌగలించుకుని రెండు భుజాలమీదా తల అనుస్తుంది. తన పరివారాన్నంతటినీ ఇలా కౌగలించుకునే వీడ్కోలిస్తుంది అత్తవారింటికి కెళ్లాక కూడా ఆమెకి ముఖం కనిపించకుండా ముసుగుంటుంది. అత్తవారింట్లో క్రొత్త కోడలిని చూసేందుకు అందరు పేరంటాండ్రు వస్తారు. కోడలు తెచ్చిన దహేజ్ చీర— సారె మొదలైనవి అన్నీ ఆమెకి ఏర్పాటు చేసిన గదిలో పేరుస్తారు. అందరూ చూసేందుకని

ఇంక వధువుని చూడటం ఎలాగ? ముఖం మీద మూరెడు పొడుగున వ్రేలాడే ముసుగుంటుందామె. స్త్రీలు ఒక్కొక్కరే ఆమె చేతిలో ఏదో కానుక. ఒక రూపాయేనాసరే పెట్టి ముసుగు తీసి ఆమెని చుస్తారు ఆమెకి అన్నీ క్రొత్తముఖాలే ఆఖరికి భర్తని కూడా సరిగ్గా చూడదు. వాళ్ల మొదటిరాత్రి నాడే భర్తని చూస్తుంది. అత్తవారింట్లో అందరూ క్రొత్తే. అందులో పుట్టింటి నుండి ఒక్క పురుగైనా రాదు. అందుకనే వధువుని అత్తవారింటికి సాగనంపేటప్పుడు గంటల కొలదీ రాగాలు తీస్తారు. పంజాబీలలో కూడా చాలా తెగల వారున్నారు. అందులో కొన్ని తెగల వారిలో క్రొత్త పెళ్లికూతురు అత్తవారింటికి రాగానే ఆడబడుచు వచ్చి వధువుని ఎత్తుకుని లోపలికి తీసుకెళ్లాలి. (ఇది కొంచెం కష్టమే! లావుగా ఉన్న వదినగారొస్తే, బక్కగా ఉన్న ఆడబడుచు ఎత్తుకోగలదా? అని కూతారింట్లో వచ్చి గంగ కూడా ముట్టరు. పుట్టింటి నుండి పిల్లని చుడ్డాని కొచ్చినా చాలా మంది వియ్యాల వారింట్లో భోం చెయ్యరుట పెళ్లయినా అమ్మాయి ఇంక సంవత్సరంవరకూ నూలే (నూలువి) బట్టలు కట్టకూడదట. అన్నీ రేష్మీ (సిల్కు) బట్టలే కట్టారు. క్రొత్తగా పెళ్లయిందని పోల్చుకుందికి ఒకే రంగు సూట్లు, చేతులకి దంతం గాజులూ, ఉంటాయి

మనకి ఇంటి పేర్లు ముందుంటాయి. వాళ్లకి పేరు చివర్న ఉంటాయి. ఒక సారి చిన్న తమాషా జరిగింది. మా పాప పుట్టినప్పుడు ఆస్పత్రిలో పేరు రాయించుకున్నప్పుడు మా నాన్నగారి పేరు రావు. మా శ్రీవారి పేరూ రావే, వస్తుంది. ఆ డాక్టరు ఆశ్చర్యంతో నోరు తెరిచి రావు కదా! రావులకే ఇచ్చి పెళ్లిచేసారేం? అని వింతగా అడిగింది. మాకు ముందు ఇంటిపేరుంటుంది. అని విడమరిచి చెప్తే 'అబ్బా! చాలా వింతగా ఉందే', అంది డాక్టరు.

ఇంక ఎవరింట్లో పెండ్లి అయినా, పిల్లలు పుట్టినా ఎలా తెలుస్తుందో మరి 'కొజ్జాలు' (నపుంసకులు) నలుగు రైదుగురు, హార్మోనియం, డోలు పట్టుకొచ్చి వాయిస్తూ నృత్యం చేస్తారు. వాళ్లకి ఎంతో కొంత పైకం ముట్టచెప్పాలి. ఇది ప్రతీ ఇంట్లో జరుగుతుంది. వాళ్లలా ఉండకుండా బాగా ఉండాలని వాళ్ల సంతోషం కోసం అలా ఆడతారట.

పంజాబీల పరిణయాలు ఒక పార్టీ ఇచ్చి నట్టుగా (మనలాగా వారం రోజులు ఆర్భాటం లేకుండా) జరిగి పోతాయి. ఎంత సందడి చేసినా ఆ బరత్ సమయంలోనే చేస్తారు.



# వనితా వాణి

## వ్యక్తిత్వం

నిజంగా వ్యక్తిత్వం అంటే కూడ తెలియని వాళ్లున్నారు. మీ వ్యాసాన్ని చదివిన పాఠకమహాశయులైన గ్రహించగలరని ఆశిస్తున్నాను.

వి. వసంతలక్ష్మి (ఉప్పల)

* * *

పాతిక సంవత్సరాలు వచ్చిన కొత్త సంసారి కొన్ని గృహస్థు విషయాలను పెద్దల సలహా అడగడం, తన ముందు చేయు పనిని గూర్చి అనుభవము గడించిన, పెద్దలైన తలిదండ్రులకు చెప్పుట వ్యక్తిత్వమునకు లోపమా?

పెళ్లికుమారుని తండ్రి రచయిత్రి వ్రాసిన విధముగా అలగాలి అనుకొని అలిగినందుకు పెళ్లి కుమారుడు కోపించి, 'మీరు ఇలాగే గొడవ చేసిన నేను ఒక్క క్షణం యిక్కడ ఉండను ఈ జన్మలో నా ముఖం మీరు చూడలేరు' అనడం, ఇదేనా వ్యక్తిత్వం? నేను ఈ పెళ్లి చేసుకు తీరుతాను. నా భార్యను పోషించగల శక్తి నా దగ్గర ఉన్నది. అని చెప్పటంలో అతని వ్యక్తిత్వం గోచరిస్తుంది.

భర్త అభిలాష ప్రకారం, భర్త చెప్పిన చీరలను భార్య కొనినట్లయితే ఆమె వ్యక్తిత్వము కోల్పోయినట్లా! నాకు తెలిసినంతవరకు భార్య అభిప్రాయము భర్త, భర్త అభిప్రాయము భార్య, తెలిసికొని అవసరమైన వారు వ్యక్తిత్వము మార్చుకొనిన వారి దాంపత్యము చిరకాలము సుఖంగా వర్ధిల్లుతుందని అనటంలో సందేహమేమీ లేదనుకుంటాను.

భార్యాభర్తల వ్యక్తిత్వాలు వేరుగా నున్నచో వారి సంసారము ఎలా ఉంటుంది?

వ్యక్తిత్వం ఎలాంటిది అన్న విషయం గమనించాలి అది మంచా, చెడ్డా? వ్యక్తిత్వం సరిగా లేనప్పుడు పెద్దలు సలహా లివ్వడం తప్పా? లేక వారి సలహాలను పాటించటం వ్యక్తిత్వానికి భంగమా?

కె. రామయ్యచౌదరి (రేటూరు)

* * *

శ్రీ రాధారాఘవ్‌గారు వ్రాసిన "వ్యక్తిత్వం" 4 రోజుల క్రితం చదివాను. వ్యక్తిత్వం' గురించి చాలా గొప్పగా వివరించారు.

జి. రాజు (ఇండియన్ నేవీ)

* * *

పురుషుల విషయంలో ఒక ఉన్నతమైన విషయాన్ని చర్చించి స్త్రీల విషయంలో చీరల రంగులు, చెవుల రింగుల గురించి చర్చించడం వ్యాసంలోని పటుత్వాన్ని చెడకొట్టిం దనుకుంటున్నాను. అయినా భార్యా భర్తల మధ్య అలాటివి ఒకరి వ్యక్తిత్వాన్ని చంపడం వరకూ పోవేమో అనుకొంటాను.

వసుమతీ ప్రసాద్ (వాల్తేరు)

## శ్రీవారి తత్వం

9—8—63 పత్రికలో శ్రీమతి ఎన్. అనసూయగారు 'శ్రీవారి తత్వం తెలుసుకోడం ఎలా? అను వ్యాసంలో భార్యలకు తన స్వంత అనుభవాలను చిట్కాలుగా, పెద్ద 'రిసెర్చి' చేసిన వాళ్ల

# Eight new fashion-fresh colours!




Choose your shade of creamy HI-FI lipstick from this exciting range! Luscious, light, bright colours from party pinks through golden-orange tones to brilliant clear reds.

# MAX FACTOR

SOLE SELLING AGENTS. T. T. KRISHNAMACHARI & CO.

BOMBAY - CALCUTTA - DELHI - MADRAS

# వనితావాణి

లాగ, అందించారు. తన స్వకుటుంబంలోనివి లోకం అందరికి వర్తిస్తా యనుకోవడం పెద్ద పొరపాటు. ఆ మాటకొస్తే వారు చెప్పిన వేళ్ల భంగిమలు, చేతిముద్రలు అంతేనా. ఇంకాలేవా ? మరి వాటి సంగతేమంటారు ? అందుచేత చేతి వేళ్ల, చేతి ముద్రలతో మన వ్యక్తిత్వాలను గురించి తెలుసుకోవటం, తెలుసుకోటానికి ప్రయత్నించటం చాలా పొరపాటు. వారు ఇంతకంటె మంచి వ్యాసాలు రాస్తే వారిని తప్పక అభినందిస్తాను.

బాలసరస్వతి (పాండి)

*  *  *

మా ఇంట్లో పిల్లలకు అంటే 4, 5 సం. ల పిల్లలకు కూడ నెరసిన వెంట్రుకలు ఉన్నాయి. అంత చిన్న వయసులో దేనివలన వచ్చినాయో తెలియలేదు. అవి రాకుండా పోవటానికి ఏదైన సలహా ఇస్తారని ఆశిస్తాము.

దయచేసి తొందరలో నెరసిన వెంట్రుకలకు ఏమి వ్రాస్తే పోయేది వ్రాయండి. దయచేసి వ్రాస్తారు కదూ. మీ జవాబు కొరకు ఎదురు చూస్తాము.

లక్ష్మి (వెంగలేరు) ★

వంటలు

## మైసూరు బోండా

కావలసినవస్తువులు :

| | |
|---|---|
| మినప పప్పు | 1 అరాకు |
| కొత్తిమీర, కరివేపాకు | కొద్దిగా |
| పచ్చిమిరప కాయలు | 3 |
| కొబ్బరి | 2 చిన్నముక్కలు |
| ఉప్పు | ఒక చెంచాడు |
| మంచినూనె | ఒక కప్పు |

మినపప్పును ఓ గంట గంటన్నర పాటు నీళ్ళలో నానబోయాలి. బాగా నానిన తర్వాత పొట్టుతీసి నీరు వడ కట్టివేయాలి. ఈ నానిన మినపప్పులో ఇంతఉప్పు పచ్చిమిరపకాయలు వేసి బాగా మెత్తగా రుబ్బాలి. కరివేపాకు, కొత్తిమీర తుంపులుచేసి కొబ్బరిని కూడా చిన్న చిన్న ముక్కలుచేసి ఈ పిండిలో కలపాలి. ఓ గిన్నెమీద నూనెపోసి బాగా కాగిన తర్వాత చిన్న నిమ్మకాయలంత సైజులో ఉండలు ఉండలుగా చేసి నూనెలో వేయాలి. ఉండలు గోధుమరంగుకు తిరిగేదాకా అందులోనే ఉడకనివ్వాలి.

కావాలనుకున్న వాళ్ళు కాసిని ఉల్లిపాయలు కూడా ఈ పిండిలో కలుపుకోవచ్చు. ★

# కథలలో కొన్ని చిరాకు పుట్టించే మాటలు!

ఇది కేవలం మా సొంతగొడవ — స్వవిషయం! మేము చదివే కథల్లో, వ్యాసాల్లో (ఇంకా ఇతర రచనల్లో!) ఏవేవో ఇంగ్లీషు (ఆంగ్ల!) మాటలు (పదాలు) దొర్లుతూవుంటాయి. మరీ చాదస్తంగా ప్రతిమాటనీ తెలుగులోకి అనువాదం చేసి తీరాలని మేముఅనము కాని వీలయినంతవరకూ తెలుగు మాటలే వాడితే (మేము) సంతోషిస్తాము! [వీలయినంతవరకూ వ్రాతప్రతిలోనే మార్పులు చేస్తాముకాని మాకు ఈ శ్రమ తప్పితే హాయిగా ఉంటుంది.]

క్రింది పట్టీలో చిరాకుపుట్టించే మాటలు కొన్ని — మాకు తోచినన్ని, జ్ఞాపకం ఉన్నన్ని!—ఇస్తున్నాము. వీటికి తెలుగు పర్యాయ పదాలు (మంచివే) ఉన్నాయని మా నమ్మకము.

అయితే మేము సూచించేబదులు 'రచనమీద ఆసక్తి' ఉన్న పాఠకులు అందరూ (ప్రఖ్యాత రచయితలు కూడా పాఠకులే కాబట్టి) ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఉత్తరాల శీర్షికకి తమ తమ సూచనలు పంపితే బాగుంటుంది! [క్రింది పట్టీలో కొన్ని మాటలంటే మాకు మరీ చిరాకు. కాని, ఇవి ఏవేవో చెప్పదలుచుకోలేదు!!]

| | |
|---|---|
| సీరియస్‌గా | స్పోర్టివ్(గా ఉండటం) |
| పోజుపెట్టి | వానిటీ |
| సింపి(పు)ల్ | క్రెడిట్ |
| విష్ (చెయ్యటం) | ఫాదరు, మదరు, సిస్టరు, బ్రదరు వగైరా.... |
| మేడమ్ (ఉపాధ్యాయిని) | మిస్సవటం (బస్సు, రైలు వగైరా) |
| సార్ (ఉపాధ్యాయుడు) | ఫీలవటం |
| స్టయి(స్టై)ల్‌గా | లైట్(గా తీసుకోవటం) |
| ఫయర్ (అవటం) | ఫంక్షన్ |
| బెస్టు | లైక్, ప్రిఫర్, కామెంట్, ఇగ్నోర్ (చెయ్యటం) |
| కామ్‌గా | నర్వస్(గా) |
| ఐస్ (అవటం) | మూనర్ప్ |
| పొలైట్(గా ఉండటం) | ★ |



వేసవి శెలవుల సాయంత్రం చల్లని గాలి వీస్తోంది. మందమందంగా వస్తూన్న ఆ గాలి మనస్సుకి ఒక విధమైన ప్రశాంతత నిస్తోంది. డాబా మీద కూర్చుని ఉన్నారు కావేరి, పద్మ, శశి, లక్ష్మి.



"మన చదువు అయిందికదా ! తరువాత మీరంతా ఏం చేస్తారు ?" అంది పద్మ రుమాలు మడతలు విప్పి మళ్లీ మడత పెడుతూ.

"నాకు క్లాస్ వస్తే ఎమ్. ఎస్. సి. చదువుతాను." అంది కావేరి కొబ్బరి ఋానె నోట్లో పెట్టుకుంటూ.

"పోనే పెద్ద. నీకు క్లాసు రాకపోతే ఎవరికి వస్తుంది" అంటూ కావేరిని చిలిపిగా మొట్టి "ఇంక కావేరి విషయం తేలిపోయింది. మిగిలిన వాళ్లు కూడా చెప్పండి. లక్ష్మి, నువ్వేం చేస్తావు ?" అంది తను పెద్ద నాయకురాలిలా, పద్మ.

"పరీక్ష పాసైనా నేను ఇంక చదవను. మామయ్యని ఇంకా కష్టపెట్టడం నాకు యిష్టంలేదు. ఏదైనా ఉద్యోగం కోసం ప్రయత్నిస్తాను" అంది లక్ష్మి తలొంచుకుని.

"నువ్వే, శశీ ?" అంది కావేరి.

"దాన్నెందుకు అడుగుతావు ? ఎలాగూ ఎంగేజ్ డ్ ఎప్పుడూ ఒకటే ఆలోచన. పర

ధ్యానం. తనువిక్కడ, మన సక్కడ. అదిగో చూడు మేఘాలవైపు చుస్తోంది, మధు దగ్గర్నుంచి ఏదైనా సందేశం మోసుకు వస్తుందనేమో ! అదిగో సిగ్గుపడిపోతూంది. బుగ్గలు కెంపుల్లాగ అయిపోయాయి''అని పద్మ అంటూంటే అందరూ నవ్వారు శశి దగ్గరున్న పుల్ల తీసుకు పద్మని కొట్టింది. పద్మ అల్లరిగా "అవునే శశీ, మొన్నను కెమిస్ట్రీ ప్రాక్టికల్సులో ఇచ్చిన మిక్చరు ఏమిటో సరిగ్గా వ్రాసి వచ్చావా లేక మధు అని వ్రాసి వచ్చావా ? ఎగ్జామినర్ అర్థంకాక చస్తాడు'' అంది శశి కూడ నవ్వేసింది.

"అందరినీ అడిగావు నువ్వేం చేస్తావో చెప్ప లేదు'' అంది లక్ష్మి.

"నేను క్లాస్ వస్తే ఎస్ ఎస్ సి. లేకపోతే తింటూ, హాయిగా కథలు వ్రాసుకుంటూ ఇంట్లో కూర్చోవడం'' అంది తేలిగ్గా

"మనం వెంటనే కాకపోయినా ఇంక కొన్ని రోజుల తరువాత అయినా నిజ జీవితంలో ప్రవేశించాలి కదా జీవితంలో వివాహం తప్పనిసరి కదా పెద్ద మాటలు ఉపయోగిస్తున్నాను అనుకోవద్దు మీరు ఎలాంటి పార్టనర్‌ని కోరుకుంటారు? ఎలాంటి జీవితం మీ కలలో ఉంది. చెప్పండి పద్మా, నువ్వు చెప్పు'' అంది కావేరి.

"ఉహూ నేను కాదు ముందు లక్ష్మి నువ్వు ముందు వర్ణించవే నీ వూహాసుందరుడిని'' అంది

"నాకేం ఎక్కువ కోరికలు లేవు ఎక్కువ అందమైనవాడు అక్కరలేదు. వికారి కాకపోతే చాలు నాకంటే ఎక్కువ చదువుకు నుండాలి. డబ్బు, హోదా లేకపోయినా నన్ను ప్రేమగా చూడడం కావాలి అత్తమామలు, ఆడబడుచులు ఉండకూడదని నేను అనను. సమిష్టి కుటుంబంలో వ్యక్తి అయినా ఫరవాలేదు. నేను సద్దుకుపోగలను. నన్ను మాత్రం అతను చాలా ప్రేమగా చూడాలి'' అంది లక్ష్మి.

"అబ్బ ఎంత సులువుగా తేల్చిపారేశావ్ ! శశీ నువ్వు చెప్పు.'' అని "నాకు తెలుసులే, ఇప్పుడు మధుగారి రూప గుణ చిత్రణ జరుగును'' అంది.

"అలా అయితే నేను చెప్పను బాబు'' అంది శశి.

"అనను మహాతల్లీ. ప్రారంభించు.''

పద్మ అన్నట్లే శశి మధుని మనస్సులో ఉంచుకుని చెప్పింది

"అందగాడు కాకపోయినా ఫర్వాలేదు.''

"అవును, మధు అంతేగా మరి''—పద్మ.

"పెద్ద ఉద్యోగస్తుడై ఉండాలి....''

"డాక్టరండూ !''—పద్మ

"నేను అతడిని ప్రాణాధికంగా ప్రేమిస్తాను. అతడు కూడా నన్ను అలాగే ప్రేమించాలి''

"తథాస్తు !''—పద్మ.

"ఎక్కువ డబ్బు లేకపోయినా ఫరవాలేదు. అంతే ! అంతకంటే నాకు యింకేమీ అక్కర లేదు.''

"అవును. డబ్బు లేకపోయినా బాధలేదు. గాలి భోంచేస్తూ, పబ్లిక్ గార్డెన్సులో డ్యూయట్లు పాడుకుంటూ బతుకుదురు గాని'' అంది పద్మ.

"నువ్వు అలాగ ఏడిపిస్తావనే నేను అసలు చెప్పనన్నాను'' అంది శశి బుంగమూతి పెట్టి.

"ఫరవాలేదులే, చెప్పేశావుగా ! మధుని ఇంకొంచెము వర్ణించకపోయావా, వినేవాళ్లము. భయపడ్డావేమిటి, ఏడిపిస్తానని !'' అని "కావేరీ, నీ వంతు వచ్చింది'' అంది పద్మ.

"నాకు చాల ఆశలున్నాయి భావిజీవితం గురించి'' అంది కావేరి.

"అన్నీ బయట పెట్టచ్చు. ప్రవేశ రుసుము లేదు'' అంది పద్మ.

"నా కాబోయే భర్త మంచి అందగాడై ఉండాలి. బాగా చదువుకున్నవాడై ఉండాలి. చదువు అంటే డిగ్రీలు మాత్రమే కాదు. అన్ని విషయాలూ తెలిసిన విజ్ఞాని అయివుండాలి నా ఇష్టాలని అతను వ్యతిరేకించ కూడదు. అలా అంటే నేను అతనికి యిష్టంలేని పనులే చేస్తానని కాదు బట్టలు, నగలు అలంకరించుకోవడం—ఇలాంటి విషయాలలో ఆజ్ఞ లుండకూడదు తన నేస్తాలు నా ఫ్రెండ్ అని కాక, వాళ్లు మా యిద్దరికీ స్నేహంగా ఉండాలి. సినిమాలకి, షికార్లకి భార్యని వెంటబెట్టుకుని వెళ్లడానికి చిన్నతనం ఫీలయ్యే వాడు నాకు వద్దు.''

"హియర్, హియర్''—పద్మ

"నా అభిప్రాయాలని అతడు గౌరవించాలి. నేనూ అతడి అభిప్రాయాలని గౌరవిస్తాను. కళా హృదయం కలవాడై ఉండాలి కళలలో ప్రవేశం లేకపోయినా, కనీసం కళని సొత్తు చేసుకున్నవారిని గౌరవించగలగాలి మొత్తానికి అతడు అన్నివిధాలా అనుకూలుడై ఉండాలి''

"మాకు అందమైన బంగళా, కారు ఉండాలి. ఇంటిముందు అందమైన పూలతోట ఆ తోటలో మొక్కలమధ్య పడుకుని, ఒక ట్రానిస్టర్ పెట్టుకుని, సన్నగా సంగీతం వింటూంటే ఎంత బాగుంటుంది !''

"చాల బాగుంటుంది. కాని చిన్న సవరణ ట్రాన్సిస్టర్ ఏమిటే అపశ్రుతిలాగ ? నీ ఒళ్లో అతను పడుకుని, నీ ముఖంలోకి చూస్తుంటే అతని జుట్టులోకి వేళ్లు దూర్చి, పీకుతూంటే ... సారీ మృదువుగా .... కోయిల పాటలు వినిపిస్తుంటే ఎంత మధురంగా ఉంటుంది ! ఏమంటావు ?

"సరేలే, ఇంక నువ్వే మిగిలావు. చెప్పు.''

"తప్పదా ? చెబుతాను. కాని నేను చెప్పబోయేది మీ దృశ్యాలంత సుందరంగా ఉండదు. సరే, నా వూహాసుందరుని వయస్సుతో నాకు నిమిత్తంలేదు. ఒక భార్య చనిపోయినవాడైనా ఫరవాలేదు పిల్లలు లేకపోతే సరి. ఇంకా ప్రేమగా చూస్తాడు నన్ను. డబ్బు మాత్రం పుష్కలంగా ఉండాలి. పెద్ద మేడ, కారు, తోట .... ''

"ఆయనని తప్ప మిగిలినవన్నీ చెబుతున్నావు. నువ్వు పెళ్లాడబోయేది ఆయననా, ఆయన బంగళానీ, కారునీనా ?''

"ఆయన డబ్బుని. ఇంక ఆయనంటావా ? ఎలా ఉన్నా ఫరవాలేదు. కాని ఒకలాగుంటే మంచిది. లావుగా ఉండాలి. పెద్ద బొజ్జ ఉండాలి. నేను సన్నంగా ఉన్నాను కదా, 'ఆపోజిట్స్ ఎట్రాక్ట్' అంటారుగా. మనకు లేనివి ఎదుటివాళ్లల్లో చూసి ఆనందించడానికి బట్టతల, గుండు అయినా ఫరవా లేదు ''

"నువ్వు నిజం చెప్పడంలేదే పద్మా !'' అంది కావేరి నవ్వాపుకుంటూ

"ఏం చేస్తాం ! ఒక్కొక్కసారి నిజం అబద్ధం కంటె బాధగా ఉంటుంది. సర్లే, ఎక్కడిదాక వచ్చాం ? జుట్టు వర్ణన అయింది కదూ ! బుగ్గమీసా లుంటే బాగుంటుంది. ఎర్రగా ఉన్న పెద్ద కళ్లూ, బుంగమీసాలు ఉన్న వాళ్లని చూస్తే నాకు మహా సరదా. అలాంటివాడి పక్కన నడుస్తూంటే ఎవరూ మనవేపు కన్నెత్తయినా చూడరు. నామాట వేద వాక్యంగా పాటించాలి. అంత పెద్దవాడికి తల్లిదండ్రు లుండరు, కనుక అత్తమామల యిబ్బంది ఉండదు. ఎలా ఉంది మన పిక్చరు ? మీకు నచ్చదు. ముందే చెప్పానుగా !'' అంటూ మూతి ముడుచుకుంది పద్మ.

"చాల బాగుందే బాబు. బట్టతల వాడినే చేసుకుంటావో. బుంగ మీసాలవాడిని చేసుకుంటావో చూస్తాంగా'' అంది లక్ష్మి.

"అందరమూ చెప్పుకున్నాం. అలా మనం కోరుకున్నవాళ్లం లభించాలని దేవుని ప్రార్థించుదాం. మనలో ఏ ఒకరి పెళ్లి జరిగినా అందరమూ తప్పక అటెండ్ అవాలి. అలా గయినా అప్పుడప్పుడు మనం కలుసుకోవడం జరుగుతుంది నేను మిమ్మల్ని ఎప్పుడూ మరిచిపోను తరుచు కలుసుకునేందుకు వీలు లేక పోయినా మనం ఉత్తరాలు వ్రాసుకుంటూనే ఉందాం. విడిపోవద్దు'' అంది కావేరి.

"ఓ పని చేద్దాం కావేరీ మనం విడిపోకుండా ఉండాలంటే మనం వియ్యమందుదాం. మా అబ్బాయికి మీ అమ్మాయి నిచ్చి పెళ్లిచేద్దాం'' అంది. పద్మ అల్లరిగా.

"అలాగే ముందు నువ్వు అబ్బాయిని కను''.

చీకటి పడడంవలన యింక ఇళ్లకి బయలుదేరారు ఆ మర్నాడుతో వాళ్లు ఎవరి వూళ్లకు వాళ్లు వెళ్లిపోతారు అంతవరకూ ఆనందంగా నవ్వులతో కబుర్లు చెప్పుకున్న అందరి ముఖాలని విచారం క్రమ్ముకుంది. అన్ని విషయాలని తేలికగా తీసుకునే పద్మకి కూడ కన్నీళ్లు ఆగలేదు. కన్నీటితో వీడ్కోలిచ్చుకున్నారు.

వెన్నెలలో పడుకున్న కావేరి మనస్సునంతా స్నేహితురాళ్లు ఆక్రమించారు తాము నలుగురూ ఎంత స్నేహంగా ఉండేవారు కాలేజిలో చాలమంది అమ్మాయిల అసూయకి కారణమైంది తమ స్నేహం. అందరిలోకి పద్మ అల్లరిది. దానికి నవ్వడమే కాని, జీవితంలో దుఃఖం తెలియదేమో ! ! లక్ష్మి నెమ్మదస్తురాలు. శశికి ఎప్పుడూ మధు ఆలోచనే. దానిని తాము ఎంత ఏడిపించేవారని ! పాత సంఘటన ఒకటి గుర్తుకి వచ్చింది కావేరికి. సంవత్సరం క్రిందట సందేహాలు తీర్చేందుకు తెలుగు టీచర్ యింటికి వెళ్లారు అందరూ. ఎవరికి తెలియనివారు అడుగుతున్నారు. "మధూ'' (శబ్దం) సాధించడం ఎలాగండి ?'' అని అడిగింది శశి. అందరూ పక్కున నవ్వేశారు. అనుకోకుండా అడిగినది యిలా దారితీసింది కదా అని శశి సిగ్గుపడిపోయింది. టీచర్ తెల్లబోయారు. ఆమె దగ్గర చనువు కనుక పద్మకి చెప్పక తప్పలేదు. శశి కాబోయే శ్రీవారి పేరు మధు అని. ఆమె నవ్వేసి "ఇప్పటినుంచి ఒద్దమ్మా. తరువాత సాధించుదువుగాని'' అనేశారు. శశి మధుని పెళ్లిచేసుకుంటుంది. కోరినవాడు లభించడంవలన దాని జీవితం ఆనందమయ మవుతుంది. మరి తన జీవితం ఎలాగుంటుందో ! తనకేం, ఇంతవరకూ

45 వ పేజీ చూడండి



# కొలంబా

## రచన: ప్రొస్పర్ మెరిమె

### జరిగిన కథ

కర్నల్ థామస్ నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం అక్కడికి వెళ్ళడం కష్టనష్టాలతో కూడిన పని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెతో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు వారితో లెఫ్టినెంట్ "ఆర్సొ డెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది వారు కార్సికా చేరారు. పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సొ తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సొ చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది. కొలంబా, ఆర్సొ అంటన్‌లు పియత్రనెరాకి వెళ్ళిపోతారు.

## 10

చాలా చిన్నప్పుడే ఆర్సో తండ్రికి వేరయ్యాడేమో వారిద్దరి మధ్యనా అంత చనువు ఏర్పడలేదు. పన్నెండవ ఏట చదువుకని పియత్రనెరా వదలి పైసాకి వెళ్ళాడు. గిల్ఫుచ్చియో యూరోప్ ఫ్రెంచి సేనలతో బాటు యాత్ర చేస్తున్న సమయంలో మిలిటరీ స్కూల్లో చదువుకున్నాడు. ఎప్పుడయినా ఒకరినొకరు కలుసుకునేవారు. 1815కి ఆర్సో తన తండ్రి ఆధిపత్యం కిందనే ఉన్న దళంలో చేరడం సంభవించింది. కాని కర్నల్‌గారి క్రమశిక్షణ అతికఠినమయినది కావటంవల్ల, ఆర్సోనికూడా తక్కిన రెజిమెంట్లో యువకులని చూసినట్లే చూసేవారు, ఆయన; అంటే, బాగా అదుపులో ఉంచేవారన్నమాట. ఆర్సో స్మృతిలో మిగిలిపోయిన ఈ కాలానికి సంబంధించిన అనుభవాలు రెండు: పియత్రనెరాలో చూపిన ప్రేమ, వాత్సల్యం—తన ఖడ్గం ఇచ్చేవాడు, తుపాకిని పేల్చనిచ్చేవాడు, భోజనం సమయంలో తనదగ్గరే కూర్చో పెట్టుకునేవాడు. మిలిటరీ స్కూల్లో చూపిన కాఠిన్యంగా—అడగకుండానే శిక్షించేవాడు. సెలవు రోజుల్లో కూడా బయటికి వెళ్ళనిచ్చేవాడు కాదు. 'లెఫ్టినెంట్ డెల్లారెబ్బియా నువ్వు నీ స్థానంలో లేవు కాబట్టి మూడురోజులు శిక్ష—మధ్యాహ్నం వేసుకున్న టోపీ నియమానికి విరుద్ధం; ఎనిమిది రోజులు శిక్ష— నీ షూటింగ్ (తుపాకీతో-అ॥) అంత బాగాలేదు, ఐయిదురోజులు శిక్ష!" ఒకే ఒకసారి మాత్రం అన్నాడు: "సెబాష్, ఆర్సో! కాని అతి దుడుకుతనం మంచిది కాదు!"

ఇంత కాలం తర్వాత ఇంటికి తిరిగి వచ్చిన ఆర్సోలో ఏవేవో జ్ఞాపకాలు మెదిలాయి. తన చిన్నతనంలో గడిపిన సుపరిచిత ప్రదేశాలూ, తన కెంతో అపురూపంగా ఉన్న తల్లి వాడిన ఇంటి సామగ్రీ, అతనిలో ఏదో అవేదనా, ఆనందమూ కూడా కలిగించాయి; ముందు రాబోయే కష్ట సమయాలు, ఆందోళన కలిగించే చెల్లెలి ప్రవర్తనా, అన్నిటికన్నా ముఖ్యం మిస్ నెవిల్ తన ఇంటికి వస్తానని మాట ఇవ్వడం ఇది తలుచుకోగానే ఆ ఇల్లు మరీ చిన్నదిగా, వెలితిగా కనిపించింది. సుఖాలకి అలవాటుపడ్డ వ్యక్తులు ఇక్కడ కష్టపడలికదా, అనుకున్నాడు. హఠాత్తుగా ఆ గృహం అసహ్యంగా కనిపించిందేమో అతనికి! ఈ ఆలోచనలవల్ల అతనిలో ఒక విధమైన నిస్పృహా ఏర్పడింది.

భోజనాలగదిలో తను నల్ల చెక్కబల్లవద్ద కూర్చున్నాడు. తన తండ్రితో బాటు అందరూ ఇదే బల్లమీద భోజనం చేసేవారు ఒకప్పుడు. కొలంబా తనతో బాటు కూర్చోవటానికి కొంచెం సందేహించటం చూసి నవ్వుకున్నాడు. భోజనం చేసేటప్పుడు ఎవరూ మాట్లాడలేదు; పూర్తికాగానే కొలంబా లోపలికి

వెళ్ళిపోయింది తనని ఇంక ఏవిధంగా ఉద్ఘాటిస్తుందో అని భయపడ్డ ఆరోన్‌కి కొంచెం తెరిపి కలిగింది. తల చేతికి ఆన్చి ఆలోచనలోపడ్డాడు గత పది హేను రోజులుగా జరిగిన సంఘటన లను సింహావలోకనం చేయసాగాడు. బారిచిస్ విషయమై తను చేయవలసి నది ఏమిటా అని ఆలోచిస్తే భయం వేసింది. అప్పటికే పియత్ర నెరా జనాభిప్రాయం తనకి ప్రపంచాభి ప్రాయంతో సమానం అయినట్లుంది. పిరికివాడు కాదని రుజువుచేసుకొన టానికి పగ తీర్చుకుని తీరాలి. కాని పగ తీర్చుకొనటం ఎలా? బారిచిస్ వక్షంవారు హంతకులని తను నమ్మ లేకపోతున్నాడు. వారికీ తనవంశం వారికీ విరోధంవున్నమాట నిజమే కాని వారికి హత్య అంటగట్టటం కేవలం ద్వేషం వల్లనే. మిస్ నెవిల్ చెప్పిన 'సూక్తి' గుర్తుకి వచ్చింది: "జీవితం ఒక యుద్ధం!"

"విజయం నాదే!" అనుకున్నాడు తనలోతానే ఈ సంతోష కర మయిన ఊహతో లేచి దీపం తీసుకుని తన గదిలోకి వెళ్లిపోబోయాడు. ఇంతలో ఎవరో వాకిలి తలుపు తట్టారు. అప్పటికే చాలా ఆలస్యం అయింది. కొలంబా, ఆమె వెంట పరిచారిక, అక్కడికి వచ్చారు తలుపు తట్టేది ఎవరని కొలంబా అడిగింది. "నేనే" అన్నది ఒక మెత్తని కంఠ స్వరం. గడియతీసి తలుపు తెరచి బయటికి వెళ్ళిన కొలంబా ఒక చిన్న పదిసంవత్సరాల వయస్సుగల అమ్మాయితో లోపలికి వచ్చింది ఆ అమ్మాయి కాళ్ళకి చెప్పుల్లేవు, గుడ్డలన్నీ చిరిగిపోయి ఉన్నాయి; తలకి ఒక పాత గుమాల చుట్టుకుని వుంది. నల్లని పొడుగాటిజుట్టు కాకి రెక్కలను పోలిఉన్నాయి. పిల్ల పాలిపోయి, బక్కగా ఎండకి నల్లబడి ఉంది. కళ్ళు మాత్రం మెరిసిపోతు న్నాయి. ఆరోన్‌ని చూసి సంకోచించి కార్సికన్ పద్ధతిలో వినయం గా పలకరించింది. తర్వాత కొలంబాకి అంతకుముందే చెంపిన ఒక పిట్టను ఇచ్చింది.

"చిలీ మీకు రుణపడివున్నాము. మీ మామయ్యకికూడా చెన్నా. ఆయన బాగానే ఉన్నాడా?"

"బాగానే ఉన్నాడండీ, మీదయ వల్ల ఇంకా పెందరాళే రాలేక పోయాను. మూడు గంటలున్నాను పొదల్లో దీనికోసమని!"

36 వ పేజీ చూడండి

## వివిధ ప్రాంతాల వింతలు 22

# వింతపర్వతాల ప్యూన్‌టా ఎరినాస్

చిలీదేశపు రాజధాని శాంటియాగోలో విమానం ఎక్కి ఓ పదిగంటలపాటు దక్షి ణంగా ప్రయాణంచేస్తే బాహియా కాటలినా విమానాశ్రయం వస్తుంది. ప్యూన్‌టా ఎరి నాస్ అనే పట్నానికి ఇది విమానాశ్రయ మన్న మాట. ప్రపంచానికి దాదాపు, దక్షిణపు అంచున అంటార్కిటికాలో ఉన్న ఈ ప్రాంతాన్ని చేరుకోవాలని చిలీనుంచి బయలు దేరితే ఆన్డ్స్ పర్వతశ్రేణులను చూడగలం. ఈ పర్వతాలు అర్జంటైనా, చిలీలను వేరు చేసే రేఖలు మాదిరి ఉంటాయి



డెల్ ఫ్యూగో ప్రాంతంలోని మంచు మయమైన ఆన్డ్స్ పర్వతాలు.

ఈ ప్యూన్‌టా ఎరినాస్ ప్రాంతం నాగరిక ప్రదేశాలకు దూరంగా ఉన్నా ఇది చూడటా నికి చాలా అందమైన ప్రదేశం కాల ప్రవా హంలో సంభవిస్తున్న అనేక సంఘటనలు ఈ ప్రాంతం అభివృద్ధికి దోహదం చేశాయి గొర్రెల పెంపకం వ్యాపారానికి ఇది సరఫరా కేంద్రం ఇప్పుడు చిన్న పట్నంగా రూపొం దింది

ఈ ప్రాంతంలో ఉండే బీగల్ కాలువలో అడ్డంగా టెయర్రాడెల్ ఫ్యూగో ద్వీపం ఉంది నూనె పరిశ్రమ ఇక్కడ బాగా అభి వృద్ధిలో ఉంది

అయితే ఈ ప్రాంతంలో పెద్ద ఇబ్బంది ఒకటి ఉంది ఇదంతా మంచు ప్రాంతం. ఈ అంటార్కిటిక్ ఖండమే మంచుమయం. అందువల్ల ఎన్ని రకాల పరిశోధక సంస్థలు వచ్చినా యిక్కడ పనిచేసేందుకు కాస్త వెను కడుగు వేస్తాయి. అంతర్జాతీయ ఆధ్యాత్మిక సంవత్సరం విషయంలో పరిశోధనలు జరిగి నప్పుడు ఇక్కడకు చాలామంది శాస్త్ర జ్ఞులు వచ్చారు. అసలీ పట్నంలో ఉండే వాళ్లలో కాస్త ఉత్సాహంగా కనిపించేదల్లా గొర్రెల, నక్కల కాపర్లు, ఈ శాస్త్రజ్ఞులు మాత్రమే.

ఈ ప్యూన్‌టా ఎరినాస్‌లో ఎగుమతి దిగు మతి సుంకాలుండనే ఉండవు. అందుకే చాలా వస్తువుల ఎగుమతి దిగుమతులు జరుగుతూ ఉంటాయి. పైగా ఈ పట్నం ఒక జాతిదికాదు. రకరకాల జాతులవాళ్లు ఉన్నారు కొత్త కొత్త రకాల ఇళ్లు ఎన్నో లేచాయి

ఈ ప్రాంతంలో నక్కల పెంపకం, పోష ణలు కేంద్రాలు చూడదగ్గవి ప్యూన్‌టా ఎరినాస్ నగరానికి 50 మైళ్ల దూరంలో నైఋతిదిక్కుగా మాగెల్లాన్ జలసంధి ప్రక్కన ప్యూర్టోబుల్‌నెస్ అనే ప్రాంతం ఉంది తెల్ల జాతి వ్యక్తి మొట్టమొదటగా 1840 లో ఇక్కడ అడుగుపెట్టిన చిహ్నంగా ఉన్న కోటలు పాడైపోగా, వాటిని తిరిగి ఇటీవలే బాగుచేశారు. దీనికి ఆగ్నేయంగా టెయిర్రా డెల్‌ఫ్యూగో పర్వతాలున్నాయి.

ప్యూన్‌టా ఎరినాస్ ప్రాంతం చాలా అంద మైంది. వింతగొలిపే పర్వతాలు, పర్వతాలను ప్రతిఫలింపజేసే నీలిరంగు సరోవరాలతో ఈ ప్రాంతం ప్రపంచంలో అందనికి కేంద్ర మైన పాటగోనియాకే పైచేయిగా ఉంటుంది.

ఈ అందాల వింతలకు అడ్డుగా నిలుస్తు న్నట్టు అక్కడక్కడా సగం కాలిపోయి, వివిధ రూపాలుగా వంగిపోయిన కలపచెట్లు కన్పిస్తూంటాయి. చిత్రలేఖనంలో అతి వాస్తవికవాది చిత్రాలకు కూడా తప్పులు పట్టే టంత సహజంగా ఉంటాయి

—టెంపిల్ మానింగ్. ★



# శ్రీకృష్ణజననం

పి. గణపతిశాస్త్రి

**చంటిపిల్ల హఠాత్తుగా అర్ధరాత్రి వేళ నిద్ర మేలుకుని సన్నగా,** నీరసంగా, జాలిగా ఏడుపుమొదలుపెట్టింది.

'అమ్మా !'

'అమ్మా ! ...

క్రమక్రమంగా ఆ ఎడతెగని ఏడుపు శ్రుతిమించి రాగాన పడింది.

పొద్దున్న లేచింది మొదలు రాత్రి బాగా చీకటి పడేదాకా భర్తకీ, పిల్లలందరికి అన్నాలు పెట్టి, కంచాలెత్తి, ఇల్లంతా కడిగి సొమ్మసిల్లి అదమరిచి నిద్రపోయిన ఇల్లాలు సోమిదేవమ్మ కళ్ళు నులుముకుంటూ లేచింది.

'అయ్యో ! రామా ! చచ్చే చావొచ్చి పడిందే నాకు ! ఎందుకే అల్లాగ ఏడుస్తావు ? ఎక్కడున్నావే !'

ఇల్లంతా కటిక చీకటి. పసిపిల్ల కాక మిగిలిన పిల్లలందరు ఆ చీకటి గుయ్యారంలో నాలుగు వైపుల అడ్డదిడ్డంగా అస్తవ్యస్తంగా చింకి చాపల మీద పడుకుని నిద్రపోతున్నారు. వీధిలో పెద్ద గాలిదుమారం లేచిన చప్పుడు హెూరుమని మారు మోగింది.

చంటిపిల్ల తల్లి గదమాయింపుతో మరింతగా గొంతెత్తి ఏడ్చింది. సోమిదేవమ్మ తడుముకుంటూ వెళ్లి పిల్లని దగ్గరికి తీసుకుని 'ఎందుకే అంకానమ్మలాగ అలాగ ఏడుస్తావు ? ఏం కావాలి ? అని మళ్లీ గద్దించింది.

'పాలే !'

ఎంతో దీనంగా ఆక్రోశించింది. పసిపాప తల్లి లైటు వెయ్యాలని స్విచ్చి నొక్కింది. కాని దీపం వెలగలేదు. గాలిదుమారంతో ఆ రాత్రి వీధి వీధి అంతా అంధకార బంధురమే. ఇంట్లో లైట్లన్నీ ఆరిపోయాయి. సోమిదేవమ్మ ఎలాగో అలాగ పాల సీసా అందుకుని పిల్ల నోటి కందించింది కాని ఆ పసిపాప ఎంత బలిమాలినా తాగలేదు అదే పనిగా ఏడ్చింది ప్రాణం విసిగి సోమిదేవమ్మ గట్టిగా ఒకటి వడ్డించింది ఇల్లెగిరిపోయేలా ఆ పసిపాప ఒకటే ఏడుపు

ఆ గొడవతో మిగిలిన చిన్నపిల్లలంతా మేలుకున్నారు. 'అమ్మా ! !' అంటూ ఒకే గొంతుతో రాగాలు మొదలుపెట్టారు. అయినా ఆ యిల్లాలు ఎంతో ఓపికతో సముదాయించింది. కాని వాతగా గుక్కోలేదు. ఆ యాతన భరించలేక ఒక

ళ్లిద్దరి వీపులమీద గట్టిగా తగిలించింది. అంతలోనే పిల్లల్ని కొట్టినందుకు ఎంతో నొచ్చుకొని బుడి బుడి దీర్ఘాలు తీసింది ఆ గందరగోళంతో ఆ గదిలో ఇంకొకచోట మేను వాల్చిన వాసుదేవరావు చిరాకుతో, విసుగుతో లేచి కూర్చున్నాడు.

'ఏమిటే ఆ గొడవ ? అనవసరంగా పిల్లల్ని ఎందుకు కొట్టుకుంటావు ?'

'అవును ! మీకేం తెలుస్తుంది. నా బాధ ! పొద్దున్ననగా వెళ్లి రాత్రి కింటికి జేరుకుంటారు ! ఇక ఇంట్లోవాళ్లేమయిపోయినా బొత్తిగా పట్టించుకోరు ! చంటిపిల్ల ఒకటే ఏడుపు ! ఎందుచేతో గాని పాలు తాగడంలేదు ! నాకు ఒంట్లో బాగుండలేదు జ్వరం తగిలినట్టుంది ... ఇదేం మంకుపట్టో గాని పాప గుక్కెడు పాలయినా తాగలేదు. నన్నొక్క నిమిష మయినా నిద్ర పోనీయడంలేదు !'

ఆమె గొంతులో గద్గదిక బాగా బరువై చిక్కుపడింది. వాసుదేవరావు లేచి తడుముకుంటూ వెళ్లి పిల్లల్ని అందరిని నెమ్మదిగా బుజ్జగించి మళ్లీ చింకి చాపలమీద పడుకోబెట్టాడు పసిపిల్లని ఎత్తుకుని అటు యిటు తిప్పి ఎలాగో అలాగ వూరుకోబెట్టాడు. పాలసీసా అందించాడు. తాగలేదు తల్లి. బలిమాలి బామాలి అందిస్తే రెండు మూడు గుక్కలు తాగింది. పక్కమీద పడుకోబెట్టి కొంతసేపు జోకొట్టిన తరువాత కళ్లు మూసుకుని నిద్రపోయింది.

పిల్లల ఏడుపుల గొడవతో బాగా దిగాలుపడి అలిసిపోయిన సోమిదేవమ్మ గుడ్ల నీరు గుక్కుకుంటూ అలాగే పక్కమీద మేను వాల్చింది. వాసుదేవరావు తిరిగి నిద్రపోవాలని ప్రయత్నించాడు. కాని కంటికొక్క కోడి కునుకయినా పట్టలేదు కిటికీ తలుపుల సందులలోనించి గాలి హోరు రంయిమని ప్రతిధ్వనించింది నాలుగయిదు నల్ల నల్లని బూజు లతని పక్కమీద పడ్డాయి పేళ్లో, జెర్రులో, బల్లుల్లో అని ఉలిక్కిపడ్డాడు. కాని అంతటి ప్రమాద మేమి జరగలేదు ! లోలోపల అద్దె యింటి ఆసామీని గట్టిగా తిట్టుకున్నాడు తను పనిచేస్తున్న కలెక్టరాఫీసులో పై అధికారి నొకసారి తలుచుకుని ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. నిరంతర మనోవ్యాధులవల్ల ఎన్ని ఏళ్లు పైబడ్డాయో అని ఆలోచించడానికి కూడా అతనికి తీరికలేదు ఇంచుమించుగా ఏభై ఏళ్లు దాటిపోయాయేమో ! ఆఫీసులో గుమాస్తా గిరీ వల్ల జీతం అంతగా పెరగలేదు గాని సంతానం సంఖ్య క్రమక్రమంగా ఇనుమడించింది

పెళ్లి అయిన తరువాత ప్రతి ఏట అతనికి కలిగినవాళ్లు అయిదుగురు ఆడపిల్లలే ! పాపం ఆ సంగతి ఇరుగు పొరుగులంతా ఎంతో విడ్డూరంగా చెప్పుకున్నారు. వారిలో కొందరు లోలోపల సంతోషించారు మరికొందరు కొంచెం జాలి పడ్డారు. మాటిమాటికి వచ్చే కానుపులతో సోమిదేవమ్మ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. ఎన్నటికి తరగని సంసార జంజాటంతో అప్పటికే వాసుదేవరావు అయిదు ప్రాణాలు అడుగంటాయి. ఏనెల కానెల గడిచి గట్టెక్కడమే గగన మయిపోయింది. ఆపైన ఇటీవల ఆఫీసు ఉద్యోగం ఉంటుందో వూడుతుందో అన్న సమస్యలో పడింది. ఎన్ని ఏళ్లు పనిచేసినా ఆ ఉద్యోగం ఖాయపడలేదు. ఆనాటి కానాటికి భార్య ఆరోగ్యం పాడవడంతో సంతాన నిరోధ ప్రక్రియ లేవయినా అవలంభించక తప్పదని నిశ్చయించుకున్నాడు. కాని ఈసారి అయినా కాస్త మొగ మొలక బయలుదేరక పోతుందా ? అన్న కొనవూపిరి వంటి ఆశతో ఉపేక్షించాడు. దానికి సోమిదేవమ్మ ఉబలాటంతోబాటు గట్టి పట్టుదల కూడా తోడుపడింది. కాని దురదృష్టవశాత్తు ఆ తరవాత పుట్టినవాళ్లిద్దరు ఆడపిల్లలే అయి వూరుకున్నారు.

అప్పటికి అతనికి మగ సంతానం కలగగలదన్న ఆశ పూర్తిగా క్షీణించింది. సోమిదేవమ్మకిక మళ్లీ కానుపు వస్తే ప్రాణాలతో బ్రతికి బయట పడడం కూడా కష్టమే అని లేడీ డాక్టరు గట్టిగా హెచ్చరించింది. సగం నెరిసిన తలతో, లావుపాటి పెద్ద కళ్లద్దాలతో, బక్కచిక్కి గుడ్లగూబలా వికృతంగా తయారయిన అతని ముఖంలో అంతులేని దైన్యం, నిరాశ, నిస్పృహ, నిరుత్సాహము, మధన సదాతాండవించాయి. వాసుదేవరావు సన్నగా కొంచెం పొడుగ్గా రివటలా గాలికి అల్లల్లాడుతూన్నట్టుంటాడు. సంసారం సాగరం మధ్య దాకా ఈదుకువచ్చి ఇక ఈదలేక కాళ్లు తేలవేసి కొట్టుమిట్టాడుతున్నట్టు ఎప్పుడు ఏదో ఆలోచిస్తూ బాగా పరధ్యానంగా ఉంటాడు. ఒక్కొక్కప్పుడు లోలోపలి స్వగతాలు బాగా పైకి వినబడేటట్టు పలుకుతూండడం కద్దు

ఉండి ఉండి హోరుగాలి కిటికీ తలుపులలో నుంచి సన్నగా మూలిగింది. సోమిదేవమ్మ గొంతులోనించి కూడా అలాంటిదే ధ్వని వినపడింది.

'ఎందు కలాగ మూలుగుతావు ? తల నెప్పిగా ఉందా ?'

ఆమె ఆ ప్రశ్న కేవిధంగాను ప్రతి సమాధానం చెప్పలేదు. తన కుటుంబ పరిస్థితి తలుచుకోగానే రావుకి గుండెమీద కుంపటి పెట్టినట్టయింది. ఏడుగురు ! ఏడుగు రాడపిల్లలు ! పెద్ద పిల్లకి అప్పుడే పెళ్లిఈడు వచ్చేసింది. ఆ అమ్మాయి తరవాత నలుగురు పిల్లలు స్కూల్లో చదువుకుంటున్నారు. ప్రతిదినము పెరిగిపోతున్న బాధ్యతలు, ధరలతో ఏపూట కాపూట 'మరి ముందు మాటేమిటి ?' అన్న ప్రశ్న అతని నొక పెద్ద పీడ కలలా పట్టుకుని వేధించింది. సోమిదేవమ్మ పరిస్థితి తలుచుకుంటే గుండెలో అంతకన్న పెద్ద అలజడి బయలుదేరింది.

వివాహమయిన కొత్తలో అతనికి భార్య చాదస్తం, పేరు బొత్తిగా నచ్చలేదు. 'సోమిదేవమ్మేమిటి ? అమ్మమ్మలాగ ?' అని నవ్వుకున్నాడు. ఆ రోజుల్లో ఆమె పుష్టిగా ఎంతో నాజూకుగా కలకలలాడుతూ ఉండేది. ఇరుగు పొరుగమ్మలందరిచేత 'అచ్చంగా సినీమాస్టారేనే !' అనిపించుకుంది. కట్నాలమాట, కానుకలమాట ఎలాగున్నా ఆ అమ్మాయినే తప్ప ఇంకెవరినీ పెళ్లాడనని వాసుదేవరావు గట్టిగా పట్టుపట్టాడు. వివాహమయిన తరువాత రెండు మూడేళ్లదాకా దేవికారాణి అనీ, రాణి అనీ, చిత్ర చిత్రమయిన ముద్దు పేరులతో పిలిచేవాడు. ఆనాటి దేవికిరాణి ఈనాటికి బాగా చిక్కి శల్యమై వట్టి అనాకారిలా అచ్చంగా సోమిదేవమ్మలా తయారయింది. పెళ్లినాడు పెట్టిన నగలన్నీ పిల్లల చదువులకనీ, పురుళ్ళకనీ పుణ్యాలకనీ హారతి కర్పూరంలా హరించుకుపోయాయి. చాకలి నాలుగు రోజులపాటు ఆలస్యం చేస్తే మాసిపోయిన చీరలతోనే కాలక్షేపం చేస్తోంది ఇటీవల తను ఒక మంచి చీర కూడా కొనిపెట్టలేకపోయాడు రావుకి భార్యమీద తన మీద ఎంతయినా జాలి కలిగింది. కాని ఏమి చెయ్యగలడు ? దగ్గరికి వెళ్లి ఎంతో ఆప్యాయంగా ఓదార్చాడు.

'పిలిచినా మాట్లాడవేమిటి ? ఎందు కలాగ మూలుగుతున్నావు? మళ్లీ నడుం నెప్పిగాని వచ్చిందా?'

'అవును. మొన్నటి నుంచి వాంతులు, నడుం నెప్పి పట్టుకున్నాయి.'

మళ్లీ నీరసంగా మూలిగింది సోమిదేవమ్మ. ఆ సమాధానంతో అతని నడినెత్తిమీద పెద్ద పిడుగు పడ్డట్టయింది. తిరిగి కానుపు వస్తే మరి బ్రతకడం కష్టమని గట్టిగా బెదిరించింది. లేడీ డాక్టరు. అలాంటి అనుమాన మేదయినా కలిగిందా ?

'ఇదేమిటి ? నేను తెచ్చిన మందు, మాత్రలు జాగ్రత్తగా పుచ్చుకోవడంలేదా ?'

సోమిదేవమ్మ ఉసూరుమని నిట్టూర్చింది. 'పుచ్చుకోకేం ? పుచ్చుగుంటూనే ఉన్నాను. ఇక భయంలేదని ఎంతో సంబరపడ్డాను..... ఏమి చెయ్యను ? నా దురదృష్టంకొద్దీ మళ్లీ ఇంతలోనే ఇది దాపరించింది. ఇక నా పని అయిపోయిందన్నమాటే ? మరి నేను బతకను.'

తన తరవాత పిల్లలు, భర్త ఏమయిపోతారో అన్న దిగులుతో సోమిదేవమ్మ గుడ్ల నీరు గుక్కుకొన్నది. అయితే వాసుదేవరావు 'ఇంతమాత్రానికే బెంబేలుపడిపోవాలా ? భయంలేదులే ! ఇంతకి మించి పోయిందేమి లేదులే !' అని కొంచెం గట్టిగా భర్త వసా ఇచ్చాడు. కాని, అతని గుండెల్లో అప్పుడే గుబులు బయలుదేరింది ఇల్లాలికి ఈసారి కానుపు రాకుండా రావు ఏవేవో మందులు, మాకులు వాడుతూనే ఉన్నాడు అలాగలాగ రెండు మూడు నెలలు గడిచేసరికి అతనికి కొంచెం అనుమానం కలగకపోలేదు. కాని ఆమె శరీరంలో ఏర్పడిన అతి నీరసంవల్ల అటువంటి పరిస్థితి ఏర్పడినదనీ, మరి భయంలేదనీ సమాధాన పడ్డాడు. లేడీ డాక్టరు కూడా అతనితో ఏకీభవించింది

ఇక ఇప్పుడు కొంచెం సూచనలు కనబడగానే వెంటనే భార్యని డాక్టరమ్మ దగ్గరికి తీసుకు వెళ్లాడు. ఆమె మాటిమాటికి కళ్లజోడు సరిచేసుకుంటూ జాగ్రత్తగా పరీక్ష చేసింది. అవి గర్భసూచనలే అని నిశ్చయించింది. ఇక సంతాన నిరోధ ప్రక్రియ లేవయినా చేస్తే తల్లి ప్రాణాలకే మోసం రావచ్చునని భయపెట్టింది. కాని కొంత తేలిక మందు వాడితే ప్రాణాపాయం కలగకుండా ప్రస్తుత ప్రమాదం తొలగిపోతే పోవచ్చునని తిరిగి కొంచెం ధైర్యం చెప్పింది

ఆ సలహాతో రావుకి సుడిగుండంలో పడి మునిగిపోతున్న మనిషి కొక గట్టి పట్టు దొరికినట్టనిపించింది డాక్టరమ్మ మళ్లీ మందులేవో ఇచ్చింది. వారం రోజులు గడిచాయి కాని ఫలితం కనబడలేదు. ఎంతగా ప్రయత్నించినా అతని సంకల్పం ఫలించలేదు. డాక్టరు మరి తన వల్ల కాదని నిష్కర్షగా చెప్పివేసింది. అంతకన్న తీవ్రమయిన మందు

34 వ పేజీ చూడండి

# తెరమీద - తెరవెనుక

## ఆఖరి పేజీ:

**వీ రా జీ**

## పాఠకులకూ, వాళ్ళకీ, కూడా కృతజ్ఞత

'అప్పుడే అయిపోయిందా?' అన్నాడో పాఠక మహాశయుడు. ఆశ్చర్యపోయాను. గత సం(క్రాంతి సంచికలో మొదటిసారి యీ శీర్షిక పేరు చూశారు మీరు. అటు తర్వాత ఫిబ్రవరి 22 వ తేదీ సంచికలో అక్కినేని నాగేశ్వరరావుతో ప్రారంభమైంది యీ శీర్షిక. 28 వారాలు, ఆదిన అనుకున్నట్లే ప్రఖ్యాతీ ప్రాచుర్యంగల సినీమాతారల సొంత విశేషాలతో సొంత అభిప్రాయాలతో నిజం బొమ్మలతో ఈ శీర్షిక అలరించింది పాఠకలోకాన్ని. ఏ శీర్షికకైనా కొత్తదనం ఉన్నంత కాలమే కొత్త శీర్షిక— కొత్త నీరువచ్చి పాతనీరు తోసేస్తుందన్నట్లు— ఓ శీర్షిక మరో శీర్షికకు చోటు చెయ్యాలిగదా ?

ఫిబ్రవరి 15వ తేదీ సంచికలో ఈ శీర్షికను పరిచయంచేస్తూ 'సినీరంగంతో ప్రఖ్యాతీ — ప్రాచుర్యం గల కొందరిని' అని చెప్పుకొన్న మాట పాఠకులకు జ్ఞాపకం ఉందనుకుంటాను అయితే ఈ 'కొందరిని' ఎలా ఎంచుకున్నారయ్యా ? అంటే అందుకు, పాఠకుల దృక్కోణమే కొలమానంగా స్వీకరించాము ఎందుకంటే ప్రేక్షకులూ పాఠకులూ ఒక్కటే కాగల అవకాశాలున్నాయి అందుచేత — గతం కొంత వర్తమానం కొంత ఎత్తు పల్లాలు జయాపజయాలు గల తారలను ఈ శీర్షికకు ఎన్నుకోడం జరిగింది!' అయితే పత్రికలో శీర్షిక ఏదేనా ఎక్కడానికి ముందు తంతు చాలా ఉంటుంది రైలుబళ్ల రాకల్ని క్షమిస్తారు గాని పాఠక మహాశయులు, ఇలాంటి విషయాల్లో ఆలశ్యాన్ని అభాసునీ మన్నించరు

అందుకే చాలా ముందస్తుగా శీర్షికకు కావల్సిన అన్ని హంగులూ అమర్చాలి అది పత్రికలో పడ్డ తర్వాత నిరాఘాటంగా వెళ్ళిపోవాలి! అందుకనే ఒకేసారి ఈ శీర్షికలోని 'వ్యక్తు'లను మేము నిర్ణయం చేసుకొన్న తర్వాత వాళ్లను మీకు అభ్యంతరం లేకపోతే ఇందుకు సిద్ధంగా ఉండమని ఓ అభ్యర్థనలాంటిది పంపించడం జరిగింది ఆ బాధ్యత నాకు అప్పగించడమూ జరిగింది.

ఈ శీర్షిక ఇంతదూరం చదివాక పాఠకులు గాని లేదా ఆయా సినీవ్యక్తులు గాని బొత్తుగా సాధక బాధకాలు లేనిది అనలేరుకదా ? ఐనా ఇది కొంగ్రొత్తగా రూపొందించాలని, సచిత్రంగా పాఠకుల కందించాలని అనుకోడం వల్ల ఈ ఇబ్బందులు మరి కాస్త ఎక్కువ!

నిజానికి సినిమారంగంలోను రాజకీయ రంగంలోను ఉన్నవాళ్లకి 'తీరిక' అనే మాట భాషలోనే ఉండదు. ఐనా ఇంతమంది తారలు మగ తారలు నాగేశ్వరరావు, రేలంగి, గుమ్మడి, కాంతారావు, జగ్గయ్య, రంగారావు మొత్తం ఆరుగురు. ఆడతారలు జమున, కృష్ణకుమారి, సావిత్రి, అంజలీదేవి, రాజసులోచన మొత్తం ఐదుగురు కాక దర్శకులు ఆదుర్తి, ప్రత్యగాత్మ, సి. ఎస్. రావులు ముగ్గురు మొత్తం పధ్నాలుగు మంది. అయితే వీళ్ళేనా ? తతిమ్మా వాళ్లు ఇక లేరా ? అంటే ఉన్నారు వాస్తవానికి పూర్తిగా వెటరన్స్‌ని గాని, కొత్తగా జువ్వల్లా వస్తోన్న వాళ్లను గాని ఈ శీర్షికకు అనుకోక పోయినా ఇంకా కొంచెం మంది వుండిపోయారు. (నిజమే)

ఈ శీర్షిక నిమిత్తం తమ ప్రత్యేక సహకారాన్ని అంటే ఫోటోలకి ఇంటర్వ్యూకి తమ (అ) మూల్యమైన కాలాన్ని కేటాయించమని కోరడం చాలామందిని జరిగింది అలాగే శీర్షికను ఆపకుండా ఏక బిగిన వెయ్యాలనుకోడమూ జరిగింది. ఈ రెండిటి సమన్వయమూ ఇన్నివారాలు సాగడం కూడా విజయవంత మవడమేనని నా ఉద్దేశం పాఠకులేమంటారో ? ...

## ఇందులో అతిరహస్యమేంలేదు

ఈ ఉద్యమంలాంటి కార్యక్రమంలో ఇప్పుడు విపరీతంగా 'బిజీ'గా ఉన్నారు కదాని, కొందరిని వదలి వేయడం, లేదా, బొత్తుగా తెనుగు బుకింగ్‌లుతేవే, అరవ గ్లామర్‌గా రాణిస్తున్నారేనని కొందరినీ మరచి పోవడం గాని జరగలేదు.

''అరుదైన పద్ధతిలో'' అనిపించుకుంటూ రెండేసి వారాలు, ఇన్నేసి చిత్రాలలో వచ్చే ఈ వ్యాసాలను లక్షలాది పాఠకులు, తమతమ అభిమానుల గురించే గనుక చదివారు. చాలా ఉత్సాహంగా చదివేరనే అనుకుంటాను. నచ్చనివారుండొచ్చు! గాని మెచ్చినవారి సంఖ్య ఎక్కువ. దీనికై ఒక 'పత్రిక' పద్ధతుల కణుగుణంగా వచ్చిన తారలందరికీ— ఈ శీర్షిక ఒక '(థ్రిల్' ఇచ్చిందనే భావించాలి (ఇవ్వలేదని ఎవరూ ఇంతవరకూ నేరుగా గాని పరోక్షంగా కాని అన్నట్లు వినబడలేదు.) అలా సమయానికి అవలేక పోవడం వల్లనే కొంత మంది అభిమాన తారలైన వారిని కొంతమందిని ఈ శీర్షికలో ఇవ్వలేక పోయాము అందుకు కాస్త విచారంగానే ఉన్నది

అది అలాఉంచి పాఠకులతో కాస్త ఇష్టగోష్ఠిగా ఈ ఇరవై ఎనిమిది వారాల ముచ్చట్లు చెప్పి . .

''మీరు వెళ్తారా ? వాళ్ళు వస్తారా ? అసలెలా అడుగుతారు ? ఏం చేస్తారు ? ఫోటోలు పాతవా ? కొత్తవా ? వాళ్ళే ఇస్తారా ? మీరే తీస్తారా ? ఇంతకీ ఆయా తారలు చెప్పినవి మీరు రాసినవి అన్నీ నిజాలా ? ఇలా ప్రశ్నల పరంపర వస్తూంటుంది— ''ఎన్ని ప్రశ్నలు తయారు చేస్తారు ?'' అని ఓ పాఠకుడు నన్ను నిలదీసాడోసారి ! 'ఇన్ని' అన్నాను రెండు చేతులూ ఎడంగా చూపించి— వాళ్ళన్నింటికి జవాబులిస్తారు ? ''కొన్నింటి''కి — అన్నాను ఎందుకూ అంటే నేను ఒక ప్రశ్నావళిని ఎన్నడూ చెయ్యలేదు. (ఒక్కరికితప్ప) అదివిని వాళ్ళు పరీక్ష పేర్లలా ఆన్సర్ చేయనూ లేదు. . . . .''

ఇంచుమించు ఇష్టగోష్ఠిగానే జరిగాయి ఇంటర్వ్యూలు—ఒక్కటిమాత్రం జరిగింది. వాళ్ళ 'ఎప్పాయింట్ మెంటనీ' 'కాల్ షీటనీ' పరిగెత్తే వేళ గాని, నాకు మరో కార్యభారం ఉన్నవేళగాని ఈ ఇంటర్వ్యూ(అనే అందాం)లను చెయ్యదల్చుకోలేదు. ఎందుకంటే ఎంత చిన్న 'క్రాస్ సెక్షన్' అయినా ఒక 'పబ్లిక్ ఫిగర్' (సినిమా తారలు రాజకీయ నాయకులను మించి పోయారు)ని స్టడీ చేయాలీ అంటే కాస్త వ్యవధీ కొంచెం సాహసం కావాలి. అందుకు కనీసం కొన్ని గంటలేనా లేకపోతే, ఫోటోలు మాటకేంగాని తతిమ్మా కథయావత్తు— అభిప్రాయాలతో సహారాదు.

అయితే, కథలూ నవలలూ రాసుకునే నా లాంటివాడికి నమ్మకంగా ఇంత కాలాన్ని ఇచ్చిన అగ్రశ్రేణి తారలున్నారు. వాళ్లకి నేను థాంక్స్ చెప్పాలి మరి. ఎందుకంటే ఈ శీర్షిక వైనం చివరికి ఎలా ఉంటుందో బహుశా ఈ శీర్షికలో వచ్చిన మొదటి ఐదుగురికి నేను వెళ్లినప్పుడు ఇంత పిసరు అవగాహన కావడానికి అవకాశం నేనే ఇవ్వలేక పోయాను. కారణం శీర్షిక ఆరంభం అయ్యాక ఆగకుండా వెళ్లవల్సి ఉన్నది గనుక ఈ శీర్షిక నిమిత్తం ఎవరెవర్ని ఎప్పుడెప్పుడు కల్సుకున్నానో (ఒకరి నించి ఒకరికి తెలిసిందేమో గాని) నేనై చెప్పలేదు శీర్షికలోని ముఖ్యమైన ఆకర్షణ ఫోటోల కావడం ఒక విశేషం అదేకాస్త ఆలస్యం కాడా ఫోటోలు తియ్యాలి, బ్లాకులు వెయ్యాలి కదా !

ఈ శీర్షికలో కుమారి జమున శ్రీమతి సావిత్రి బొమ్మలను మాత్రం శ్రీ ఎస్ ఎస్ రాధాకృష్ణన్ తీశారు. తతిమ్మా వాళ్లందరి విషయంలో శ్రీ ప్రభాకర్ 'కామిరా' ప్రముఖ పాత్ర వహించింది. శ్రీయుతులు నాగేశ్వరరావు ఆదుర్తి ప్రత్యగాత్మల బొమ్మలతో శ్రీ రూప తీసినవి ఉన్నాయి.

''ఆం.... నాలుగో మూడో వేస్తారు ? ఇన్ని బొమ్మ లెక్కడ పడతాయి ?'' అన్న దొక ప్రఖ్యాత తార. ఎవరోగాదు మన అభిమాన తార సావిత్రియే అనుకుంటాను.

అప్పుడు నేను చమత్కరించినట్లు కూడ జ్ఞాపకం ''పట్టకపోతే చిన్నబ్లాకులేనా చేసి వేస్తాం గాని మానము''ని— దరిమిలాన చూశారుగా.... అనుకున్నకంటే చాల బాగుందని అన్న శీర్షికలో ఆమె దొకటి. ముప్ఫయి పైచిలుకు బొమ్మలు తీస్తేగాని చాలేవికాదు.

నిజానికి ఫోను చెయటం రెండో మెట్టుగా ఈ శీర్షిక కార్యక్రమం ఆరంభమైంది. ఫోనులో అసలు వ్యక్తి కంఠం రావాలి ! అప్పుడు వేళ నిర్ణయించుకోవాలి ! ''గడియారాలు చూస్తూ మాట్లాడితే ఉహూం....'' అనే వాణ్ణి.... ఆ తర్వాత ఫొటోగ్రాఫరూ, అతని కామిరా వగైరా నా కత్తికట్టారూ (కలంగిలం వగైరా) . . .

గేటు దగ్గర గూర్ఖాలు లోపల అటెన్షన్‌లు, ఆనక సెక్రటరీలు, ఇవన్నీ అయ్యాక

ఇల్లంతా చూడటం మరీ ఇదిగా నలుదిశలా చూడాలి మరి ! అద్దాల బీరువాలు, అద్దాలు ఉంటే ఓ గొడవ — "ఫ్లాష్ వాడతాంగా... సోఫాలు, బీరువాలు, పుస్తకాలు,— రకరకాల అయిడియాలు అన్నీ ఆ ఇంట్లోనే వెతకాలి. తర్వాత, ఫోటోగ్రాఫర్‌కి కొన్ని నచ్చవ్ అంటే పనికిరావ్! మనకి కొన్ని బొత్తిగా కిట్టవ్—ఇంకా కొన్ని మన అభిమాన తారలకి పొసగవ్— ఈ మూడూ కుదిరినా పాఠకులకు అంతగా నయించనివి కొన్ని ఉంటాయ్ ! పైగా అన్నీ నిజం ఇంటి లోపల తీయాలేమో... ఫ్లాష్ వాడటం తప్పదు. అందుకు ప్రభాకర్ ప్లగ్ పాయింట్ కోసరం వెతుకుతూ ఉంటే నేను ఇంచుమించు నిజం ఇంటర్వ్యూ మాట్లాడుతూనే "మీరు మేకప్ లేకుండానే బాగుంటా"రని ఓ వ్యాఖ్యానం చేసేవాణ్ణి. ఇందులో అసత్యం దగా రెండూ లేవు. నా ఉద్దేశం ఎప్పుడూ, తెరమీద మీరు వాళ్ళని రకరకాల వేషాల్లో మేకప్‌లో చూస్తారుకదా అంతే కాకుండా నిజంగా చూపించి ఉభయత్రా మెప్పు పొందాలని అంతే! ఆ తర్వాత అసలు కార్యక్రమం ఫోటోలతోనే.... వరుసగా చాలా ఫోటోలు తియ్యాల్సి వచ్చేది 'అదేమరొక్క స్నాప్' అనే వాడు ఫోటోగ్రాఫర్ 'ఎందుకూ' అంటే నాతో రహస్యంగా "ఫోకస్ చేశాక ఒక్క అడుగు వెనక్కువేశా అందుకూ" అనేవాడు. మరోసారి నేను "సారీ ! ఒన్ మోర్ ! అనే వాణ్ణి ఎందుకంటే నా భయం వారి ఒకవేళ బ్యాక్‌గ్రౌండ్‌లో ఉన్న అక్కర్లేని దేదేనా వచ్చేస్తుందేమో అనో లేదా, నాతో మాట్లాడు తూంటే, కొన్ని అనుకోని భంగిమలు వస్తాయే మోనని అదీ యిదీని.....

కుమారి కృష్ణకుమారి ఇంట్లోనే కాబోలు ఇవతల పోర్టికోలోయున్న కారు మీదకు మనసు పోయింది నాకు. తార, ఫోటోగ్రాఫర్ ఇద్దరూ శ్రమ పడాల్సి వచ్చింది— పైగా కృష్ణకుమారి బొమ్మ అలా మాత్రమే రావాలి అంటే ప్రభాకర్‌ను అక్కడే ఉన్న ఓ గోడ ఎక్కించాల్సి వచ్చింది.— ఈలోగా ఆడియన్స్‌ని (గేటు దగ్గర) కూడా కాస్త కంట్రోలు చెయ్యాల్సి వచ్చింది. అసలు మేకప్ లేకుండా కూడా మన తారలు బాగుంటారా అన్నది ఈ శీర్షికలోని బొమ్మలు చూశాక మీరు ఒప్పుకుంటారుగా ! ఒక్క శ్రీమతి సావిత్రి అనుకుంటాను. ఈ విషయంలో కాస్త ఇష్ట పడలేదు. ముఖ చిత్రాలకు తారలర కొలువు లకూ కావాలనే "బ్లైట్ క్లోజప్"లకు మేకప్ అవసరమే నన్నది కూడా తీసిపారేయకూడని మాటే అనుకోండి కాని శ్రీయుతులు కాంతారావు, జగ్గయ్యలు, కాని శ్రీ గుమ్మడి, కుమారి జమున శ్రీమతి అంజలీదేవి కాని వీరందరి ముఖచిత్రాలు పెద్ద బొమ్మలూ అన్నీ మేకప్ లేనివే మరి ! మరోసారి ఒకరీలు అంతా తీశాక మా ఫోటోగ్రాఫర్ "నాకు అనుమానంగా ఉంది ఈ ఫిల్మ్ పాడైందేమో ? అని అన్నాడు. ఎలా ఉంటుంది? నాకు చెప్పండి— 'అయితే పోనీగాని గవ్‌చిన్‌గా మరో రీలు తీయమన్నాను. ఇది ఎవరి విషయం లోనో చెప్పకపోవడం వృత్తి ధర్మం అనుకుం టాను.

శ్రీ కాంతారావు ఇంటి కుటుంబం అంతా కావాలి అన్నాను. అవతల కారు దగ్గర బాగున్నాను. నిజంగా తారలు నాకు ఇచ్చిన గౌరవం నాపట్ల చూపిన ప్రేమాభిమానాలు నన్ను యెంతో ముగ్ధుణ్ణి చేశాయని ఈ సందర్భంలో పేర్కొనాలి ! ప్రభాకర్‌ని గోడఎక్కించాను మళ్లీ ! ఎండ ! పైగా ఆ గోడ 'కాలుతోంది'— ఫోటో తీశాక కాంతారావుగారి రెండోవాడు కాస్త తల దించేశాడనిపించింది. అమాటే అంటే "గోడ మీదున్నప్పుడే చెప్పకూడదు.... మళ్లీ ఎక్కాలా?" అన్నాడు ప్రభాకర్.... నాకే ఇప్పుడు కష్టమని పిస్తుంది. కాని ఇప్పుడు అప్పుడు మాత్రం 'ప్లీజ్' అని బలవంతం చేశాను.

అయితే శ్రీమతి సావిత్రి కొన్ని బొమ్మలకు అంత ఉత్సాహం చూపకపోయినా, చాలవరకూ, దుస్తుల విషయంలో ఆమె శ్రమ అనుకోకుండా మాతో సహకరించి, అక్కడక్కడ ఫోటోగ్రాఫర్‌కు సలహాలిచ్చారు. ఆమెకు మా రాధాకృష్ణన్ (ఫోటోగ్రాఫర్) 'థాంక్స్' చెప్పాడు. అయితే ఆరోజు ఆమె శ్రీవారితో గాని, వాళ్ల పాపాయితోగాని బొమ్మలు తీయడం అవలేదు. దరిమిలాన పాఠకులడిగారుకూడా.

అందరికన్న శ్రీమతి అంజలీదేవి సహకరించిన తీరు నన్ను ఆనంద పరిచింది. ఆమె "ఇంత చిన్నవాడు ఇన్ని సలహాలు ఇంత ఆర్భాటం చేస్తున్నాడు" అనుకోలేదు. పైగా శ్రద్ధగా అనుభవం లోనే కాదు అనేక విషయాల్లో ఆమె కన్నా చిన్న వాళ్లమైన నాతోను ఫోటోగ్రాఫర్‌తోనూ సహకరించి, ఏ ఫోటో ఏవిధంగా కావాలంటే అలాగే తీసుకోమన్నది. ఫోటో తీసుకున్న తర్వాత ఆమె ఏమైనా సలహాగా అనేది. నాకు ఆమెతో ఇంటరూర్వ్యూను జరిపిన రోజు వాస్తవానికి తిరుగు దలలో పెద్ద వానకురిసినా, చాలా ఆలస్యమైనా, నా 'వీడు' దూరమే అయినా శ్రమ అనిపించ లేదు.

ఆలాగే కుమారి జమున ఇంట్లో వో గమ్మత్తు. "వీణ వాయించేవాళ్ళు ఎవరూ అలా పట్టుకోరు" అన్నదామె. (నిజంగా నాకు రాదుగా) కాని 'అలా ఐతే బాగుంటుంది' అన్నాను "ఏం బాగో.... మీ ఇష్టం కాని ఆనక మిమ్మల్నే తిడతారు పాఠకులు...." ఆమె అన్నట్లు నాకూ భయం వేసింది సరే, "మీ ఇష్టం ఒక్కటీ నా ఇష్టం ఒక్కటీ" అన్నాను—చివరికి (8—3—63) ఆ నాయిష్ట మైన ముఖచిత్రం అందరికీ బాగుందికదా!

## పాఠకులదే ఘనత !

## తారలదే గొప్ప !!

ఈతారలంతా నా పట్ల ఉంచినభరోసా, గొప్పది. ఈశీర్షిక తీరుతెన్నులు—దీనికి పాఠకులరియొక్క నూ తెలిశాక వాస్తవానికి—రాగల అభిప్రాయాలు—సహకారంవేరు. అదివరకు శ్రమ అనుకోకుండా గంటల తరబడి చెప్పేవాళ్లు అడిగేవాళ్లకి లోకువ అన్నట్లు అడిగేస్తూ ఉంటే — వాళ్ల అందు లోను సినీమాతారలు— జవాబులు చెప్పడం ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల యొక్క గొప్పతనం అంటాను. ఇందులో నేను నిమిత్త మాత్రుణ్ణి పాఠకులూ ప్రేక్షకులూ ఒక్కడే కాగల అవకాశముంది. అందుకే ఈ ఇరువురికీ 'తారల'ంటే ప్రత్యేకమైన ఇష్టం. వాళ్ల ఇష్టం వీళ్ల ఇష్టం— బాధ్యతగా స్వీకరించి ఈ రెండు పక్షాలకు పక్షపాతం లేకుండా కాస్త కాలక్షేపాన్ని— తృప్తినీ ఇచ్చా ననుకుంటాను— ఎక్కడేనా నిజం కాస్త నిష్ఠూరంగా అన్నానేమో అందుకు సహృదయంతో ఇరుపక్షాలు విగ్రహించు కుంటారని అనుకుంటున్నాను.

## శలవ్....కాదు అందాకా....

మొత్తం మీద ఈ శీర్షికలో మీరు అను కుంటున్నంత 'థ్రిల్' కాకపోయినా నాకు "మన స్సులు నొప్పించకండా ఇన్నివారాలు నిభాయించేనే అన్న తృప్తి కలిగింది".... అయితే ప్లాటు కోసం కథలకోసం ప్రాతంకోసరం తిరగడంవేరు ఈ 'తారల'ను వాళ్ల ప్రపంచంలో కొట్టుకు పోతున్న వాళ్లని, నిలిపి అభిమానులకు అందించ గలగడం వేరు— ఇందుకు తోడ్పడిన అందరికీ నా హృదయ పూర్వకమైన కృతజ్ఞత.

'మీరు నేనూ వాళ్లు' ఉంటాం గనుక, సదా పాఠకుల అభిమానం నాకు కావాలి గనుక 'శలవ్' అనో 'గుడ్‌బై' అనో అనను 'సోలాంగ్' అంటే "అందాకా...." అంటాను.








# సింహస్వప్న నాయకుడు

## చీఫ్ యినస్పెక్టర్ ఛార్లెస్ చనివీర్ (పారిస్ ఫ్రాన్స్)

ఫ్రాన్స్‌కు 'సింహస్వప్న'మయిన ఆ ముఠాను దాని నాయకుణ్ణి పట్టుకోడానికి నాకు పద మూడు సంవత్సరాలు పట్టింది. ఎలాటి దుండ గీళ్ళనైనా పట్టుకునే నేర్పుగల మేము— మూడు సంవత్సరాలు పట్టుదలతో పంతంపట్టి ముప్ఫై మూడు నెలల్లో చిట్ట చివరికి పట్టుకున్నాము.

మా పట్టుదల చిట్ట చివరికి శరీరాన్ని కొరికేసే చలిలో, హోరున వానల్లో పారిస్ నగరంలో నెర వేరింది. ఆ కాలం హాయిగా స్వేచ్ఛావిహారానికి వెళ్ళ డానికి అనువైన దేమీ కాదు. ఆ నాడు మేము పడ్డ బాధలు, యాతనలు, మాయోపాయాలు నేటికి నాకు గుర్తున్నాయి

మా వెతుకులాట మాంట్‌మేర్ జిల్లాలో 'త్రిషెల్స్' అనే ఒక హోటల్లో ఫలించింది.

ఆ హోటలంతా వచ్చిపోయే వారితో కిటకిట లాడుతోంది.

''స్ట్రా బెర్రీస్, క్రీము పట్రా''అని తలుపు కు ఎదురుగా ఉన్న ఒక టేబులు ముందు కూర్చున్న పొట్టి సొగసైన వ్యక్తి కేకవేశాడు. ఎడంచేత్తో చలవకళ్ళజోడు సరిచేసుకున్నాడు. చొక్కా గుండీల మధ్య దోపుకున్న కుడి చెయ్యి మాత్రం అతనుపైకి తియ్యనే లేదు

ఇంతలో చక్కని, నల్లని, నిగనిగలాడే లియో స్పైన్ కారొకటివచ్చి ఆగింది. అతనాకారుకేసి చూశాడు. ఆ కారులోంచి— సొగసుగా ముస్తా బయిన ఇద్దరు వ్యక్తులు, ఇంగ్లీషు వారిలో కొంచెం ఛాయ తక్కువగా ఉన్న స్త్రీ, దిగి హోటల్లోకి వచ్చారు

''చక్కని కారు'' అంటూ అతను తన ముందు పెట్టిన పదార్థాలను ఎడం చేత్తో ముందుకు లాక్కున్నాడు. ''బాగా కలవారులా ఉన్నారు !'' అనుకుంటూ చమ్చాను ఎడం చేత్తో తీసి పట్టు కున్నాడు. చురుకైన అతని కళ్ళు 'ఆమె' మెడలో వేళ్ళాడుతున్న నెక్లెను మీద పడ్డాయి. అతని కుడిచెయ్యి మాత్రం స్థాన భ్రంశము కాలేదు.

ఇంతలో టెలిఫోను గణగణలాడింది. బార్‌లో సర్వ్ చేస్తున్న ఒకడు ఫోనులో ఏదో మాట్లాడి జనం వైపుకు తిరిగి, ''మాన్సియర్ ఏంద్రి అనే వారి కోసం ఫోనువచ్చింది.'' అన్నాడు.

కార్లో వచ్చిన వారిలో ఒకతను పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ టెలిఫోన్ బూత్ వైపు నడిచాడు. అలా నడుస్తూ అతను 'ఆ' పొట్టి వ్యక్తి ప్రక్కకు వచ్చి టక్కున ఎగిరి, చొక్కాలో ఉన్న అతని కుడిచేతిని నులపలు పెట్టి బయటికి లాగాడు

ఎడం చేతిలో చెమ్చా, ఆ చెమ్చాతో నల్లటి, నిగనిగలాడే రివాల్వరు ఎగిరి నేలమీద పడ్డాయి. అదే సమయంలో నేను స్వింగ్‌డోర్ తెరచుకుని హోల్లోకి ప్రవేశించాను.

మాన్సియర్ ఏంద్రి నిజానికి నా అసిస్టెంటు రోజర్ బోర్నెక్.

అతను నేను హోల్లో ప్రవేశించేలోగానే అతని చేతికి అరదండాలు అలంకరించాడు. ఆ పొట్టి వ్యక్తి కాస్త పెనుగులాడేసరికి, అతని కళ్ళజోడు ఎగిరి నేలమీద పడి, అతి భయంకరమైన అతని కళ్ళు బయటు పడ్డాయి.

అప్పుడే వస్తున్న నన్ను అతను ఆనవాలు కట్టి గుర్రుమన్నాడు తనను పట్టుకోడానికి 'ఫోన్ పథకం' వేశానని గ్రహించాడు.

''ఓహో ! మీరా, మిస్టర్ చెనివిర్'' అని పళ్ళు పటపట లాడించాడు.

''ఆహా ! నేనే ! మిస్టర్ ఎమైల్ బూయి సన్ నేనే, మూడోసారైనా అదృష్టవంతుణ్ణి'' అన్నాను నేను

* * *

1950 జూన్ 10వ తేదీన పారిస్‌లో ఒక హోటల్లో అతన్ని, ఎలాగయితేనేం అరెస్టు చెయ్యగలిగాను యుద్ధకాలం నుంచీ ప్రజల ఏకైక శత్రువు ఎమైల్ బూయిసన్ పోలీసు ఫైళ్ళన్నీ ఆక్రమించుకుని, చిట్ట చివరక నా చేతిలో చిక్కాడు. అతనిలాటి వ్యక్తిని 'నా పోలీసు ఛీఫ్ డిటెక్టివ్ జీవితంలో' చూడనే లేదు

చిరకాల వాంఛ నెరవేరిందన్న సంబరంతో సంతోషంతో నేను ఆ సాయంత్రం కాస్త చీకటి పడ్డాక స్టేషనుకు వెళ్ళాను. నన్నభినందించడానికి కాసుకుని ఉన్నవాడు అభినందించి వెళ్ళి పోయాక, ఏకాంతంగా ఆలోచిస్తూ గతంలోకి వెళ్ళాను . ఫైల్స్ అరలోంచి అతని ఫైలు, నా సొరుగులోంచి నోట్ పుస్తకం తీశాను. నా పుస్తకం నిండా నేపడ్డపాట్లు, ఆలోచించిన ఆలోచనలు, వేసిన పథకాలు, అభిప్రాయాలు ఉన్నాయి. అవన్నీ ఆ టక్కరి నక్కకు చెందినవే!!

నేను పోగు చేసిన ఫోటోల్లో ఒక పాత చిరిగి పోయిన ఫోటో ఒకటి ఉంది. అది ఎమైల్ చిన్ననాటిది. అందులో అతని పరివారం, తల్లి దండ్రులు అందరూ ఉన్నారు. అంతా సన్నగా, శుచీ శుభ్రం లేకుండా ఉన్నారు. వాళ్ళల్లో నవ్వూ త్రుళ్ళూ లేకుండా కఠినంగా ఉన్నది ఒక్క ఎమైల్ మాత్రమే ! !

ఆ ఫోటోలో ఎమైల్ పుట్టిన వూర్లో తీసి నది. 1898లో — ఫ్రాన్స్‌లోకల్లా వాణిజ్యంలో పేరు పొందిన 'లియాన్'లో పుట్టాడు.

పాపం ! ఎవళ్ళనని ఏం ప్రయోజనం ? ఏ పనైనాసరే చేసి, కూడు సంపాదించుకోడానికి వారు అలవాటు పడ్డారు. పదిహేనేళ్ళ పిల్లను, భయపెట్టి, మభ్యపెట్టి, ఆజ్ఞాపించి, ఆమె సహాయంతో ఒక ఇనప కొట్టులో మొట్ట మొదటి సారి దొంగతనం చేసి, మా శాఖకి 'ఎమైల్ పరిచయ మయ్యాడు. అతనికి ఆ నాటికి తొమ్మిది ఏళ్ళు.

ఎమైల్ కుటుంబం అసలొక దుఃఖ సాగరం వంటిది. అతని తండ్రి తాపీ పనివాడు. అతి తాగుడుకు లోనై పాటర్స్ ఫీల్డ్ స్మశానంలో తనకో శాశ్వత స్థానాన్ని సంపాదించుకున్నాడు. పదిమంది పిల్లల్లో ఐదుగురు, తిండిలేక, పోషణ లేక, బాల రోగాలవల్ల చనిపోయారు. మనసు స్థిమితం తప్పిన అతని తల్లి తన చివరి రోజులు పిచ్చాసుపత్రిలో గడిపింది

ఎమైల్‌కి పద్నాలుగో ఏడు వచ్చేలోగా జువె నైల్ కోర్టుకు ఓ పదిసార్లు హాజరయ్యాడు. ఎమైల్, అతని సోదరుడు జీన్ బాప్టిస్ట్ దొంగ తనాల్లో అఖండ ఖ్యాతి గడించారు.

ఎమైల్ మొదటిసారి పట్టు పడినపుడు అతన్ని దక్షిణ ఆఫ్రికా సైన్యం లో పంపారు. తిరుగుబాటు నాయకుడు ఎబెడ్ఎల్ క్రిమ్ మీద జరిపిన యుద్ధంలో అతన్ని చేర్చారు. ఈ సదవకాశాన్ని ఎమైల్ ఉపయోగించుకుని, అటునుంచి బయట పడ్డాక బుడిబుడి దొంగ తనాలు మానేసి, స్పానిష్ సరిహద్దులో ఆయుధాల మందులు రహస్య వ్యాపారం ప్రారంభించాడు.

ఆ వ్యాపారంలో కాస్త అనుభవం సంపాదించాక, అతనికి చదువను, వ్రాయను నేర్చుకుందామనే అభిలాష పుట్టింది. మళ్ళీ అతని ఫైలులో కాగితాలు చేరాయి ఎమైల్ నివసించి, వెళ్ళి పోయిన చోట్లు వెతికి కొన్ని దినపత్రిక కత్తిరింపు ముక్కలు, డిల్లింగర్, కపోన్‌ల గురించిన సమా చారం, రక్తపు మడుగుల మధ్య యథేచ్ఛగా విహరించే ఆ దుండగీళ్ళ ఫోటోలు కొన్ని సంపా దించాను. ఎమైల్ చదువను, వ్రాయను నేర్పడంవల్ల కొత్తరకం నేరాలు, అవి చేసేవారిని గురించి స్వయంగా చదివి అవగాహన చేసు కున్నాడు. ఇరవయ్యో శతాబ్దంలో అతిభయంకర నేరాలు, హత్యలు, దోపిడులు చేసేవారిని గూర్చి తెలుసుకున్నాడు.

నల్లమందు, కొకైన్ (ఒక రకం మత్తు పదార్థం) వ్యాపారం బాగా గణించి పెడుతుందని గ్రహించి చైనాలో 1934లో షాంగ్‌హై నాట్య శాలను స్థాపించాడు. ఆ నాట్యశాల వెనుకవైపు నుంచి అసలు వ్యాపారం సాగేది. పోలీసులకి విష యం తెలిసి, అతన్ని పట్టుకో బోయేసరికి టక్కున ఫ్రాన్స్ పారిపోయాడు.

ఎమైల్ బూయిసన్‌తో అతని నేరాలలో భాగం పంచుకున్న జేన్ అనే ఒక వెలయాలి ఫోటో నాకు చిక్కింది. ఆమె చూపరులను ఇట్టే ఆకర్షించే పద్ధతిలో వస్త్రధారణ చేసుకుని, తన వృత్తిని ద్విగుణీకృతం చేసుకునే దనుకుంటాను.

43 వ పేజీ చూడండి



తెనుగు 'జీవితం'లో నటించిన తమిళ తార వైజయంతీమాల హిందీలో చాలా ప్రఖ్యాతిగాంచినది. ఈ చిత్రాలు మూడు 'చిత్తూరు రాణి పద్మిని' లోనివి

# తారల కొలువు 4








ఉదయం తొమ్మిదిన్నరవుతుంది. రుక్మిణమ్మ ఉల్లిపాయలు తరుగుతూంది. ఆమె కుమార్తె సరోజ జడ అల్లుకుంటూ పచార్లు చేస్తోంది.

"పోస్ట్" అని వీధిలో నుండి కేక వినపడింది.

సరోజ వెళ్లి పోస్ట్‌మాన్ లోనికి విసరిన కార్డు పట్టుకొని చదువుతూ తల్లి వద్దకు వచ్చింది.

"ఎక్కడనుండే ఆ ఉత్తరం?" అనడిగింది రుక్మిణమ్మ

"అన్నయ్యకు ఎవరో అమ్మాయి వ్రాసిన ట్టుంది" అంది సరోజ ఉత్తరం చదువుతూ.

"అన్నయ్యకా ? అమ్మాయా ? ఎవరా అమ్మాయి ? ఏమని వ్రాసింది ?" ఆత్రుతగా ప్రశ్నలవర్షం కురిపించింది రుక్మిణమ్మ.

"చదువుతా విను" అంటూ ఉత్తరం చదవటం ప్రారంభించింది. సరోజ.

విశాఖపట్నం.

మహారాజశ్రీ శేఖర్ గార్కి, సుశీల నమస్కారములు మీరు వెళ్లిన వెంటనే ఉత్తరం వ్రాస్తా మన్నారు. కాని మీవద్ద నుండి ఇంతవరకు ఉత్తరం రాలేదు. బహుశా అక్కడికి వెళ్ళగానే

నన్ను మర్చిపోయి ఉంటా రనుకుంటున్నాను. మిమ్మల్ని చూడాలనుంది. బుధవారం ఉదయం బస్సులో వస్తున్నాను. ఇంతే సంగతులు.

ఇట్లు,
సుశీల.

రుక్మిణమ్మ త్రాచుపాములా లేచి సరోజ చేతిలోని ఉత్తరం లాక్కొని చదివింది.

"ఎవరే ఈ సుశీల ?" కోపంగా అడిగింది సరోజని.

"నాకేం తెలుసు ? అన్నయ్య స్నేహితురాలు కాబోలు" అంది సరోజ అయోమయంగా.

రుక్మిణమ్మ కాలుగాలిన పిల్లిలా చిందులు త్రొక్క నారంభించింది.

"వెధవ ! రానీ చెపుతాను. ఏదో చదువుకొని వెలగబెడతాడనుకొని పై ఊళ్లకు పంపిస్తే అమ్మాయిలతో స్నేహాలా ? ఇదా వీడు చదివిన చదువు ?"

తల్లి కోపాన్ని చూసి సరోజ మవునం వహించింది.

"అసలు పై ఊళ్లకు చదువుకు పంపొద్దని గోలపెట్టాను ఆయన నామాట వింటేనా ? కొడుకు బియ్యే చదివేస్తాడు, మనల్ని ఉద్ధరించేస్తాడు, ఇంత చేస్తాడు, అంత చేస్తాడని నామాట కాదని పంపించారు. ఇప్పుడు పరువు ప్రతిష్టలు మంటగలిసేటట్లున్నాయి .... "

"ఇవాళే వస్తుందటమ్మా ! ఇంకో గంటకు రావచ్చు" అంది సరోజ.

"పీకలమొయ్య తెచ్చాడు. అదేవతో వచ్చి యిక్కడ కూర్చుంటే ..... అయ్యో అయ్యో ఎంత అప్రతిష్ఠ .... ఇప్పుడేం చెయ్యడం ?" అంటూ కూలబడింది రుక్మిణమ్మ.

"ఒకవే అన్నయ్య, ఆ సుశీల ప్రేమించుకున్నారే మనకులమే అయితే గియితే పెళ్లి చేసేస్తే అంది సరోజ మెల్లగా.

"[illegible] మొహంలా ఉంది .... మన కులమే అయితే పెళ్లి చేసుకోవాలనుంటే ఇంతకాలం ఈ వెధవ మనతో చెప్పకుండా ఎందుకూరుకున్నాడు ? ఆ వెధవ రానీ పెళ్లి చేస్తాను" కోపంతో మండిపోయింది రుక్మిణమ్మ.

"అన్నయ్య పెళ్లి తర్వాత చేద్దువుగాని, ముందా సుశీల వచ్చి గుమ్మంలో బైఠాయిస్తే ఏమిచేస్తాం ?" అనడిగింది సరోజ భయపడుతూ.

"మళ్లీ దాని పేరెత్తావంటే చంపేస్తాను. సు ... శీలట, సు .... శీల .... పెళ్లిగాకుండా పరాయి మగాళ్లతో మాట్లాడటానికి దానికి సిగ్గుండొద్దూ ... రానీ. చెప్తాను దానికి" రౌద్రాకారం దాల్చింది రుక్మిణమ్మ.

"కొంపదీసి దానిమీద కేకలు వేస్తావేమిటి ? అదే బజారుస్త్రీయో అయితే మన పరువు తీసి పందిర వేస్తుంది" అంది సరోజ.

రుక్మిణమ్మ కోపం దుఃఖంలోకి మారింది.

"ఇప్పుడెలా చచ్చేదే తల్లీ ! వీడింత అప్రాచ్యపు పని చేస్తాడనుకోలేదు. ఇప్పుడా పిల్లొచ్చి ఇక్కడ నలుగురి పెద్దలను పిలిచి తగువు పెడుతుందేమో ?" కళ్లొత్తుకుంది రుక్మిణమ్మ.

"ఏమో !" అంది సరోజ.

"సమయానికి ఈయనగా రెక్కడి కెళ్లారో ?" అంది రుక్మిణమ్మ.

"బజారుకెళ్లి కూరగాయలు తెమ్మని నీవే కదమ్మా చెప్పింది" అంది సరోజ.

"నా మతి మండినట్లే ఉంది. బజారు కెళ్లినాయన ఇంకా రాకపోవట మేమిటి ! బొత్తిగా ఈయనకు ఇంటి ధ్యాస లేనేలేదు. గంటన్నరయింది. వెళ్లి ఇంకా కూరగాయల దగ్గరే కూర్చున్నారా ? చూడు వస్తున్నారేమో" అంది రుక్మిణమ్మ.

సరోజ బైటకు వెళ్లి చూసి వచ్చి,

"రాలేదమ్మా" అంది.

"ఆయ నెందుకొస్తారూ .... రారు .... ఇక్కడ నే నొకతెనున్నానుగా అన్నిటికీ ఏడవటానికి."

"అమ్మా ! ఒకపని చేస్తే" అంది సరోజ.

'ఏమిటది' అన్నట్లు చూసింది రుక్మిణమ్మ.

"మనం గుమ్మందగ్గర నిల్చుందాం. ఆ సుశీల వచ్చి 'శేఖర్ ఇల్లు ఇదేనా ?' అని అడుగుతుంది. ఇది కాదని చెప్పేస్తే పోతుంది" నా ఆలోచన బాగుందా అన్నట్లు తల్లివైపు చూసింది సరోజ. రుక్మిణమ్మ మొహం వికసించింది.

"అలాగే చేద్దాం" అంది. మళ్లీ అంతలోనే దిగాలు పడిపోయింది.

"మనం ఈ ఇల్లు కాదని చెప్పేస్తే ప్రక్కింటి వాళ్లను అడుగుతుంది. వాళ్లు మన ఇల్లు చూపిస్తారు. అప్పుడు మనింటి కొస్తుంది" అంది రుక్మిణమ్మ.

"వస్తే, ఇక్కడకు రావటానికి వీల్లేదు .... ఫో అని తరిమేద్దాం" అంది సరోజ. రుక్మిణమ్మ కోపం పరాకాష్ట నందుకుంది.

"నీ తెలివి తెల్లారినట్లే ఉంది. దాంతో ఘర్షణ పడితే నలుగురు చేరి నవ్వుతారు" అంది.

"అయితే, అది రాగానే లోపలికి తీసుకొనివచ్చి మర్యాదచేసి కొంత డబ్బు ఇచ్చి పంపేద్దాం. అదే దిక్కుమాలిన ముండో అయితే డబ్బుని చూడగానే చంకలు గుద్దుకొని చక్కా పోతుంది" అంది సరోజ.

రుక్మిణమ్మకీ సలహా నచ్చింది.

"నీ సలహా బాగనే ఉంది. కాని డబ్బేది ? మీ నాన్న దగ్గర తాళా లున్నాయి" అంది రుక్మిణమ్మ.

ఠంగ్ ... ఠంగ్ ..... ఠంగ్ .... మని పది గంటలు కొట్టింది గోడ గడియారం.

"టైమయిందమ్మా ! ఈపాటి కామె స్టేండ్‌లో దిగి ఉంటుంది" అంది సరోజ.

రుక్మిణమ్మ ఓర్పు నశించింది. ఆరున్నొక్క రాగం మొదలెట్టింది. ఆ రాగంలోనే ఏడుకొండల వాడికి దండంపెట్టి ఈ ఆపద గట్టెక్కిస్తే నీ నీ దర్శనం చేసుకుంటానని మొక్కుకుంది.

సరోజ వీధి గుమ్మంవైపు చూస్తూ కూర్చుంది. కొంతసేపటికి రాఘవయ్యగారు కూరల సంచి పట్టుకొని వచ్చారు. రుక్మిణమ్మ రాగం విన్పించగానే ఆయన గాబరాపడ్డారు.

"ఏం జరిగింది ?" ఆతృతగా అడిగారు సరోజని.

ఏమని చెప్పాలో బోధపడక తికమక పడింది సరోజ.

"మరే .... ఉత్తరం వచ్చింది" అంది తండ్రివైపు చూస్తూ.

"ఉత్తరమా .... ఎవరు పోయారు ?" అనడిగారు రాఘవయ్యగారు.

రుక్మిణమ్మ చర్రున లేచి "నేను" అంది.

రాఘవయ్యగారు నిర్ఘాంతపోయారు.

"నీ కేమైనా మతిపోయిందేమిటి ?" అనడిగారు భార్యను చూస్తూ

"నాకు కాదు మతి పోవడం ! ఈ ఉత్తరం చూస్తే మీకే పోతుంది ఆ ఉన్న కాస్త మతి" అంటూ కార్డును అతని మీదకు విసరికొట్టింది.

రాఘవయ్యగారు క్రిందపడిన కార్డు తీసి చదివి,

"ఎవరీ సుశీల" అనడిగారు భార్యని

"మీ దెష్టపుత్రుడి ప్రియురాలు. మీ కోడలు" అంది రుక్మిణమ్మ కోపంగా

"ఆఁ" అంటూ గుడ్లప్పగించారు రాఘవయ్యగారు.

"అలా చూస్తారేమిటి ? టైమయింది. ఆవిడొచ్చేస్తుంటుందీపాటికి. ఏ దో వి ధం గా దాన్ని తగిలేయండి. లేకపోతే పరువు పోతుంది. నేను మొదట్నించీ మొత్తుకుంటున్నాను. వాడిని పైవూర్లకు పంపొద్దని. నా మాట విన్నారా ? ఇంతవరకు తెచ్చారు. అనుభవించండి" అంటూ రాఘవయ్యగారిని సాధించడం మొదలుపెట్టింది రుక్మిణమ్మ.

"ఎందుకలా దెయ్యం పట్టినట్లు కేకలు వేస్తావ్ ? ప్రక్కింటివాళ్లు వింటారు. ఇంకా అది రాకముందే నీవు పరువు తీసేటట్లు కన్పిస్తున్నావ్" అంటూ భార్యమీద కేకలు వేశారు రాఘవయ్య.

"బాగుంది .... అది వచ్చేవరకు మీ రిద్దరూ కేకలు వేసుకుంటుండండి" అంది సరోజ. రాఘవయ్యగారు శాంతించి కుర్చీమీద కూలబడ్డారు.

"వాడేడి ?" అనడిగారు.

"వీధిలో తిరిగి వచ్చిన మీకే వా డెక్కడున్నాడో తెలియకపోతే, ఇంట్లో కూర్చున్న మాకేమి తెలుస్తుంది" అంది రుక్మిణమ్మ

రాఘవయ్యగారు ఆలోచనలో పడ్డారు.

"ఒకపని చెయ్యండి అది రాగానే లోనకు పిలిచి నచ్చచెప్పి, వందో, ఏభయ్యో ఇచ్చి పంపించేయండి" అంది రుక్మిణమ్మ.

"అలాగే చెయ్యాలి" అన్నాడు రాఘవయ్య.

"జేబులో డబ్బుంచుకొండి. దానెదుట మీరు ఇనప్పెట్లో నుండి డబ్బు తీస్తే అది వేలు అడుగుతుంది" అంది రుక్మిణమ్మ.

రాఘవయ్యగారు లేచి ఇనప్పెట్టెలో నుండి వంద రూపాయల[illegible] ఏభై రూపాయలు ఒక జేబులోను, ఇంక[illegible] ఏభై ఇంకొక జేబులోను పెట్టుకొని కూర్చున్నారు రాఘవయ్యగారికో సందేహం వచ్చింది

"ఒకవేళ అది డబ్బొద్దంటే ఏమిటి చెయ్యడం ?" తన సందేహం బైటపెట్టేరు రుక్మిణమ్మకు మళ్లీ చిర్రెత్తుకొచ్చింది.

"డబ్బొద్దంటే పెళ్లి చెయ్యండి. వాడిని పంపొద్దంటే నా మాట కాదని పంపించారు. ఏం చేస్తారో మీ యిష్టం అసలు దేనికైనా నామాట వింటేకదూ . మొన్న ఆ రైతుకి డబ్బు ఇవ్వకండీ వాడు తిరిగి ఇవ్వడు అని చిలక్కి చెప్పినట్లు చెప్పాను. విన్నారా. వాడు మర్యాదస్తుడు, రెండు రోజుల్లో ఇచ్చేస్తాడని ఇచ్చారు ఏగి ఇచ్చాడా ? పోయాయి ... నిష్కారణంగా వెయ్యి రూపాయలు వాడి మొహాన్ని కొట్టేరు. నా మాటంటే మీకు

## రెండు నాణాలు

బొత్తిగా ఖాతర్లేదు" రుక్మిణమ్మకు రాఘవయ్య గారిని దెప్పటానికి సమయం దొరికింది

భార్య సాధింపులతో రాఘవయ్యగారు ఉగ్ర రూపం దాల్చారు

"ఛీ! నోర్ముయ్ ప్రతి దానికి దెప్పడం, సాధించటం అలవాటైపోయింది నీకు పోనీలే కదా అని వూరుకుంటున్నాను మళ్లీ నోరెత్తావంటే చాకిరేవు పెట్టేస్తాను" కేకలువేస్తూ భార్య మీదకు వచ్చారు రాఘవయ్య

"ఎందుకు కొట్టరూ! వూరుకుంటే అందర్నీ కొట్టేస్తారు అసలిదంతా మీవల్లనే వచ్చింది" అంది రుక్మిణమ్మ ఆయన కెదురుగా వచ్చి

"ఇదంతా నీవల్లనే వచ్చింది వాడిని తెగ గారాబం చేశావు ఎప్పుడైనా వాడికి భయం చెప్తే అడ్డొచ్చి వాడినింతవరకు తయారు చేశావు ముందు నిన్ను శుద్ధి చేస్తే వాడికి బుద్ధి వస్తుంది" అంటూ ప్రక్కనున్న చీపు రందు కున్నారు రాఘవయ్యగారు

శృతి మించింకని గ్రహించి, సరోజ వాళ్లిద్దరి మధ్యకు వచ్చి, "అబ్బబ్బబ్బ మీ రిలా దెబ్బ లాడుకుంటే ఎలా? అసలు దాని గురించి ఆలోచించటం మాని ఇతర విషయాల గురించి పోట్లాడు కోటానికిదా సమయం? అది వచ్చేస్తే మనం ఆలోచించేదేమీ లేదు" అంది

రుక్మిణమ్మ, రాఘవయ్య శాంతించారు ముగ్గురు వీధి ద్వారంవైపు దృష్టి నిల్పి ఆలోచిస్తూ కూర్చున్నారు

రెండు నిమిషాలు గడిచేసరికి శేఖర్, ఎనిమిదేళ్ల అమ్మాయిని తీసుకొని వస్తూ గుమ్మం ముందు కన్పించాడు

"ఎవరే ఆ అమ్మాయి?" అనడిగింది రుక్మిణమ్మ సరోజని

"ఏమో దాని చెల్లెలో, కూతురో అయి ఉంటుంది" అంది సరోజ

"మనం కేకలు వేస్తామని దాన్నెక్కడో దాచి ఉంటాడు" అన్నారు రాఘవయ్యగారు నెమ్మదిగా

ఇంతలో శేఖర్, ఆ అమ్మాయి వాళ్ల దగ్గరకు వచ్చారు

"ఏంరా! మంచివాడవని, బుద్ధిమంతుడవని నిన్ను చదువుకు పంపిస్తే ఇదా నువ్వు చేసిన నిర్వాకం" అనడిగారు రాఘవయ్య

శేఖర్ తెల్లబోయి "నేనేం చేశాను" అనడిగాడు

"ఏం చేశావో నీకు తెలియదా! సుశీల ఎవరు? ఆ అమ్మాయికి నీకు ఏమిటి సంబంధం? ఈ పిల్లెవరు?" అనడిగారు రాఘవయ్యగారు

ఆ అమ్మాయి, శేఖర్ ఒకరి మొగాలొకరు చూసుకున్నారు

"ఈ అమ్మాయే సుశీల నాన్నా" అన్నాడు శేఖర్

"ఆఁ" అంటూ ముగ్గురూ ఒకేసారి ఆశ్చర్య పోయారు

"ఏం! అలా ఆశ్చర్యపోతున్నారు?" అనడిగాడు శేఖర్ కూడా ఆశ్చర్యపోతూ

రాఘవయ్యగారు తేరుకుని,

"అబ్బే, ఏం లేదులే ఈ అమ్మాయి ఎవ రమ్మాయి?" అనడిగారు

"మనవాళ్లే వీళ్ల ఇల్లు నా గదికి దగ్గర్లోనే ఉండేది ఈ అమ్మాయికి నావద్ద చనువు ఎక్కు వయి పోయింది వీళ్లన్నయ్య హార్బర్లో పనిచేస్తు న్నారు నెలకు రెండొందలు జీతం మన సరోజ కైతే ఈడు జోడు బాగుంటుంది" అన్నాడు శేఖర్

రుక్మిణమ్మ మొహం చాటంతయింది సరోజ సిగ్గుపడింది రాఘవయ్యగారు చిరునవ్వు నవ్వారు

రుక్మిణమ్మ చివాలున లేచి సుశీలను దగ్గరకు తీసుకొని 'రామ్మా లోనికిరా అన్నయ్య అందరు బాగున్నారా?" అనడిగింది ఆప్యాయంగా

"బాగున్నారండీ" అంది సుశీల ముద్దుగా

"ఏమే సరోజా! అలా మొద్దులా నిల్చున్నావేం సుశీలను లీసువెళ్లి స్నానం చేయించు ఏమండీ! మీరు హొటల్‌కు వెళ్లి కాస్త ఏదైనా టిఫిన్ పట్రండి కాఫీ ఇంట్లోనే చేస్తాను పాపం ఎప్పుడు తిందో ఏమో" అంది రుక్మిణమ్మ

సుశీలను తీసుకొని లోనికి వెళ్లింది సరోజ

రాఘవయ్యగారు తేలికైన మనస్సుతో చొక్కా కోసమని జేబులో చెయ్యి పెట్టేరు చేతికి నోట్లు తగిలాయి వాటిని తీసి కొడుకు చేతిలో పెట్టేరు

"ఇవెందుకు?" అనడిగాడు శేఖర్

"సుశీల కోసం వచ్చినమ్మాయిని అలాగే పంపిస్తామా? బట్టలు కొను" అంటూ చొక్కా తీసి తొడుక్కొని హొటలుకు బయలుదేరారు రాఘవయ్యగారు

"ఒరే అబ్బాయ్! నేత బట్టలు తీయకు ఎంత డబ్బయినా సరే మంచి సిల్కు బట్టలు ఎంచు నీకు ఎంచడం చేతకాకపోతే ఇక్కడకు పంపించు" అంది రుక్మిణమ్మ శేఖర్‌తో

"అలాగేనమ్మా" అని బట్టలకొట్టువైపు వెళ్ళి పోయాడు శేఖర్ 

---

### గ్రహస్థితి

మిథునంలో రాహువు, సింహంలో సూర్య శుక్రులు, కన్యలో బుధుడు, తులలో అంగారకుడు, ధనుస్సులో కేతువు, మకరంలో శని మీనంలో గురువు, మీన, మేష, వృషభ, మిథునాలలో చంద్రుడు




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

### ఈ వారము ధరలు

పసుపు ధర పెరుగుతుంది మిర్చి ధర నిలకడగా ఉంటుంది నూలు ధరలో హెచ్చు తగ్గులు అధికం, లవంగాలకు గిరాకీ వస్తుంది' నూవులు, నూవుల నూనెలకు మంచి ధర వస్తుంది

**6-9-1963 శుక్రవారము మొదలు**

**12-9-1963 గురువారము వరకు**

**మేషం**

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారంలో మీ గ్రహస్థితి బాగున్నది ధన విషయంలో ఇబ్బంది ఉండదు స్నేహితులతో వచ్చిన వివాదాలు తగ్గుతూ వస్తవి వృత్తికి సంబంధించిన కార్యక్రమాలలో ప్రోత్సాహం బాగుంటుంది అధికారులు సమయంలో అనుకూలిస్తారు తరచూ శ్రిప్పటతో కూడిన పనులు తటస్థపడుతవి కుటుంబంలో అనారోగ్యాలవల్ల ఖర్చులు, అశాంతి కలిగినా తిరిగి వెంటనే అనుకూలత కనుపిస్తుంది ధనము కాని, విలువగల వస్తువులు ఇతరుల చేతికి పోకుండా చూచుకొనండి వారాంతంలో అకస్మాత్తుగా కలహాలు రాగల అవకాశా లున్నవి ధనాశతో కార్యభారం పెంచుకొన తగిన సమయంకాదు 6, 7 తేదీలలో సంతోషవార్తలు, అధికారులతో స్నేహం

* * *

**వృషభం.**

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ సమయంలో ప్రత్యక్షమైన చిక్కులకన్నా మానసిక బాధలు అధికంగా ఉంటవి. నిష్కృత ప్రసంగాలతో బాధించేవా రుంటారు. కార్యరంగంలో సహాయం చేయవలసినవారు తటస్థంగా ఉండిపోతారు వ్యాపార వ్యవహారాలలో అభివృద్ధి కనుపిస్తుంది ఆదాయం సంతృప్తికరంగా ఉంటుంది ప్రయాణము చేస్తారు నరముల బలహీనత తోచగల సమయం తొందరపడి చేసిన పనులవల్ల వృధా ఖర్చు కనుపిస్తుంది అధికారులతో మాట్లాడటంలో జాగ్రత్త అవసరం మీ శక్తిని చూచుకొనకుండా వాగ్దానాలు చేసి ఇబ్బంది పడతారు పుణ్యకార్యాలు నెరవేరుతవి బంధువులవద్ద నుంచి శుభవార్తలు తెలుస్తవి 11, 12 తేదీలలో కుటుంబ కలహాలు, నష్టం.

* * *

## మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా )**

ముందు మిమ్ములను ప్రోత్సహించినవారే మిమ్ములను నిరుత్సాహపరుస్తారు దైవానుగ్రహంవల్ల అన్నీ అనుకూలంగా జరిగిపోతవి స్వశక్తిమీద ఆధారపడి పట్టుదలతో ముందుకు పోగలుగుతారు వ్యవహార విజయం లభిస్తుంది విలువగల వస్తువులు కొంటారు అన్నివిధాలా సహాయము, ఆదరణ లభిస్తవి సంఘ కార్యాలలో మీ బాధ్యత, విలువ కూడా పెరుగుతుంది అనుకొన్న ప్రయాణాలు నిలుపుకొనవలసి వస్తుంది అయితే ఈ సమయంలో ధనలోపం కనుపిస్తుంది ఆయా సమయాలకు ఏదోవిధంగా సమర్థించుకో గలుగుతారు కుటుంబంలో సుఖము, సంతోషము లభిస్తవి ఎదటివారి స్వభావం తెలుసుకొని స్నేహం చేయండి 7, 8 తేదీలలో ధనలాభం, శుభవార్త

* * *

## కర్కాటకం :

**( పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష )**

స్నేహితుల మాటలు మీ మనస్సును అలజడి కలిగిస్తవి కాని, స్వయంగా కార్యభారం పైన వేసుకొంటారు గౌరవము, ధనలాభము పెరుగుతవి కోర్టు కచేరీలలో భయపడవలసిన స్థితి తొలగిపోతుంది పిల్లలవలన సంతోషం లభిస్తుంది తలవనితలంపుగా క్రొత్త మార్గాలలో ఆదాయం లభిస్తుంది శుభకార్య సందర్భాలలో ఖర్చులు పెరుగుతవి ఇతరుల అడ్డు ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిన అవసరం కలుగుతుంది కుటుంబ విషయాలలో నిరుత్సాహం తోచినా కార్య భంగం అంటూ ఉండదు వారాంతంలో విరోధ సూచన లున్నవి 8, 9 తేదీలలో సంఘ గౌరవం, ఆస్తి వృద్ధి

* * *

## సింహం :

**( మఖ, పుబ్బ, ఉత్తర 1 పా )**

పర్యవసానంలో జయం మీదే కాని, ఆరంభంలో తీవ్రంగా పోటీపడవలసి వస్తుంది మిమ్ములను బయటపెట్టి తాము చల్లగా తప్పుకొనటానికి ప్రయత్నించేవా రుంటారు ఆదాయం బాగుంటుంది ఎదురుచూస్తున్న వార్తలు ఆలస్యంగా అందగలవు లెక్కలు, వ్రాతలు మొదలైనవానిలో పొరపాట్లు వస్తవి వారం మధ్యలో మంచివారి స్నేహం లభిస్తుంది ఇంతకుముందు ఒప్పుకొన్న బాధ్యతలను ఈ సమయంలో నిర్వహించవలసి వస్తుంది దైవకార్యాలు సుఖంగా జరుగుతవి కుటుంబంలో అనారోగ్యాలు కనిపిస్తవి 10, 11 తేదీలలో సంతోష వార్తలు, బంధుమిత్రులవల్ల శ్రమ

* * *

## కన్య :

**( ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా )**

శక్తి లేకపోయినా గౌరవంకోసం భారం వేసుకొనవలసి వస్తుంది బంధువుల నిష్ఠూరాలు అధికమవుతవి అనేక ఆలోచనలు చేస్తారు కాని అందులో కొన్ని మాత్రమే ఒక రూపానికి వస్తవి వృత్తి, ఉద్యోగాలలో ఫలితంకన్నా గౌరవం బాగుంటుంది ఇతరుల నిమిత్తం మీ శక్తిని వినియోగిస్తారు ఈ సమయంలో ఇతరులను సహాయం కోరటం మంచిదికాదు పిల్లలకు అనారోగ్య కాలం నౌకరులతో కలహాలు వస్తవి కుటుంబంలో దుబారా ఖర్చులు పెరుగుతవి మీ పొరపాట్లను గ్రహించుకొని జాగ్రత్తపడ గలుగుతారు 9, 10 తేదీలలో కార్యానుకూలత, అధికారుల స్నేహం

## తుల :

**( చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీరు యధార్థం మాట్లాడినా ఇతరుల దృష్టిలో విపరీతార్థం తోస్తుంది మీ మంచితనాన్ని ఆధారం చేసుకొని శ్రమను కలిగించేవారు తటస్థపడతారు వృత్తిలో మధ్య మధ్య నిరుత్సాహము, ధనలోపము తోస్తూ ఉంటవి మీ ఆరోగ్యము కూడా సాధారణముగానే ఉంటవి క్రొత్తగా ఆరంభించే వ్యాపార వ్యవహారాలలో సాధక బాధకాలు ముందే యోచించి నిష్కర్షగా మాట్లాడుకొనటం అవసరం ప్రయాణం శ్రమకరంగా జరుగుతుంది మీ పేరు ప్రతిష్ఠలకు లోపం కలిగించే వార్తలు బయలుదేరగల అవకాశాలున్నవి వృత్తిలో క్రొత్త అనుభవం కలుగుతుంది భాగస్థులను చేర్చుకొనటం మంచిదికాదు 11, 12 తేదీలలో అపవాదులు, నష్టము

* * *

## వృశ్చికం.

**(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఒకప్పుడు విసుగు కనిపించినా పట్టుదలతో ఫలితం సాధించుకొంటారు అన్నింటికి ధైర్యం, ముందు యోచన ప్రధానం మీ క్రింద పనిచేసే వారితో వ్యతిరేక భావాలు ఏర్పడవచ్చు బుద్ధి బలంతో కార్యం సాధించుకొంటారు వారం మధ్యలో అకస్మాత్తుగా కష్టవార్తలు తెలియగలవు డబ్బు ఖర్చు చేయటంలో జాగ్రత్త, విచక్షణ అవసరం నిరాటంకంగా వృత్తి వ్యాపారాలు సాగిపోతున్నా ఏదో ఒక సందర్భంలో మనస్సులో కలవరం తోస్తూ ఉంటుంది ఈ సమయంలో ఏ మార్పు వచ్చినా మీ మంచికే దారితీస్తుంది 6, 7 తేదీలలో వృత్తిలో శ్రమ, శుభవార్తలు, బంధు దర్శనం

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా )**

న్యాయంగా జయం పొందగలుగుతారు మిమ్ములను వ్యతిరేకించేవారు క్రమంగా దారికి వస్తారు సంఘకార్యాలు అధికం మొత్తంమీద మాట పెరుగుతుంది కుటుంబంలో వ్యతిరేక భావాలు కనిపించి సమసిపోతవి అన్నివిధాలా సుఖం లభిస్తుంది. వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. పదిమందిలో ఘనత పొందవలసిన సమయం. వృత్తి ఉద్యోగాలలో కూడా మంచి స్నేహం లభిస్తుంది అనుకోకుండా అభివృద్ధికరమైన మార్పు తెలుస్తుంది భూములు, వాహనాలు కొనటానికి మంచి సమయం 10, 11 తేదీలలో అనారోగ్య సూచన, అదుర్దా కలిగే వార్త.

* * *

## మకరం .

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

గత కాలంలో మీరు చేసిన ఆలోచనలు ఉపయోగించలేదనే విషయం తెలుస్తుంది వృత్తిలో శ్రమ అధికం మీవల్ల కార్యం జరుపుకొని చిన్నచూపు చూస్తారు లోగడ రావలసిన ధనం కొంత వరకు చేతికి వస్తుంది ధన విషయంలో ఇబ్బంది పడుతూ క్రొత్త కార్యక్రమాలకు పూనుకొంటారు కుటుంబ పరిస్థితులు ముందుకన్నా మేలుగా ఉంటవి సంబంధంలేని వ్యవహారాలలో తల దూర్చవలసిన అవసరం ఏర్పడుతుంది పుణ్య కార్యాలలో పాల్గొనే అవకాశం లభిస్తుంది విద్యార్థులకు ప్రోత్సాహకరమైన సమయం వారం రెండవ భాగంలో లగ్ని, ఆయుధము వీనివల్ల బాధకలిగే అవకాశాలున్నవి ప్రయాణ సూచన

* * *

## కుంభం

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ భాద్ర 1, 2, 3 పా )**

ఆడంబరం తక్కువ పనులు జరుగుతవి అధికారులను కలుసుకొంటారు త్రిప్పట ఎక్కువ ఇతరుల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి లాభ వార్తలు తెలుస్తవి ఒక సమయంలో వస్తువులు పోగొట్టుకొంటారు ఆత్మీయులతో ఎడబాటు కలుగుతుంది వృత్తిలో శ్రమ అధికం కలహ ప్రసంగాలు వస్తవి అయితే వెంటనే అణచివేయ గలుగుతారు కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి కొంతకాలం ముందు ఆశ వదులుకొన్న పనులు చక్కగా జరుగుతవి 9, 10 తేదీలలో గౌరవం ఆదాయ వృద్ధి

* * *

## మీనం .

**(పూ భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి )**

ముఖ్యమైన బాధ్యతల నుంచి బయటపడ గలుగుతారు శత్రువులు అడ్డు రావచ్చు మీకు ఏవిధంగాను కష్ట నష్టాలు కలుగవు వృత్తిలో మాత్రం ఉత్సాహము, అభివృద్ధి అంతగా ఉండవు విరివిగా ఖర్చు కనుపిస్తుంది శుభకార్య ప్రయత్నాలు కొనసాగుతవి బంధుమిత్రులవలన తగినంత సహాయం లభిస్తుంది గౌరవప్రదమైన వారితో స్నేహ సంబంధాలు ఏర్పడుతవి ఈ సమయంలో అవసరంకొద్దీ దుబారాను భరించవలసి వస్తుంది కోర్టు కచేరీలలో మీ మాటకు విలువ లభిస్తుంది ప్రయాణాలు చేస్తారు 9, 10 తేదీలలో ఉత్సాహవార్తలు, గౌరవము ★

# కృష్ణజననం

2౩ వ పేజీ తరువాయి

వీది వాడినా ప్రమాదం తప్పదని నొక్కి నొక్కి చెప్పింది ఇప్పటినించి జాగ్రత్తపడి టానిక్కులు అవ్వి ఇప్పిస్తే, దైవం చల్లగా చూస్తే, ఎలాగో ఆగాగ గండం గడిచి ఒడ్డున పడితే పడవచ్చునని వలహా యిచ్చింది

కాని భార్య పరిస్థితినిబట్టి అతనికేమాత్రము ధైర్యం కలగలేదు ఎడపిల్ల పురిటికి బ్రహ్మ ప్రళయంమీద ప్రాణాపాయం తప్పింది సరే కానున్నదేమో కాకమానదని గుండె రాయి చేసుకున్నాడు రావు అతి కష్టంమీద అప్పుచేసి భార్యకి మందులు అవ్వి కొన్నాడు అయినా ఆనాటి కానాటి కామె బాగా నీరసించిందే కాని కొంచెమైనా కోలుకోలేదు మళ్లీ కొన్ని ఖరీదయిన మంచి మందు లేవో కొన్నాడు అలాగలాగ తొమ్మిది నెలలు గడిచిపోయాయి రావుకి తానున్న వహా పట్నణంలో అవసరం వస్తే కాస్త ఆదుకునే ఆత్మీయు లెవ్వరు కనబడలేదు అందుచేత ఆస్పత్రిలో చేర్పించాలని ఆలోచించాడు కాని ఇంటి దగ్గిర గంపెడు పిల్లలతో నిభాయించుకోవడ మెలాగ ?

సోమిదేవమ్మకి కూడా ఆస్పత్రిలో చేరడం బొత్తిగా సరిపడలేదు తన కేమయినా అపాయం వస్తే పిల్లల్ని, పెనిమిటిని కాస్త దగ్గిరగా కళ్లారా చూసుకునే అదృష్టం కూడా పట్టదేమో అని కంటనీరు పెట్టుకుంది ససేమిరా ఆస్పత్రిలోకి అడుగు పెట్టనంది అక్కడ ఎవరు తిన్నగా చూడరని మొండికేసి కూర్చుంది వెనకటిసారి ఆస్పత్రిలో చేరడం మూలానే తన కంతటి యిబ్బంది కలిగినట్టు మొరపెట్టుకుంది

రావు కేమి పాలుపోలేదు తిరిగి డాక్టరమ్మ దగ్గిర తన గోడు వెళ్ళబోసుకున్నాడు ఆమె తన అసమర్థత బయటపెట్టడాని కిష్టపడలేదు ఎలాగో అలాగ శ్రమపడి తనే మాట దక్కించ గలనని ధైర్యం చెప్పింది అంతగా అవసరమయితే ఆస్పత్రికి తీసుకు వెళ్లడం అంత కష్టం కాదని నచ్చజెప్పింది ఆమె అంతగా ఆసరా ఇస్తానన్న తరువాత అతని కదే మంచి మార్గమని తోచింది ఇంకొక గత్యంతరం లేకపోవడం కూడా దానికొక ప్రధాన కారణమే ఉజ్జాయింపుగా వారం పది రోజులలో పురుడు వస్తుందనగా ఆసపె అధికారిని సెలవడిగాడు ఆయన ఏ ధోరణిలో ఉన్నాడో గాని లక్ష్యపెట్ట తటపటాయించలేదు 'భార్యకి పురిటిరోజు లయితే మధ్యన నీ కెందు కయ్యా సెలవు ?' అని చమత్కరించి అడ్డు తగలలేదు అడిగిన వెంటనే సెలవు మంజూరు చేశాడు

సెలవు పెట్టిన తరువాత అప్పుడే వారం రోజులు గడిచిపోయాయి ఏడవనాటి మధ్యాహ్నం నించి ప్రపంచం అంతా ఒకే గొంతుతో మూలుగుతున్నట్టు విధి విరామంలేని ముసురు పట్టుకుని వేధించింది ఇబ్బందులన్నీ ఏకమై మీద విరుచుకు పడడం రావు కింతకు మునుపే బాగా అనుభవంలోకి వచ్చింది అందుచేత ఆవేళే నొప్పులు ప్రారంభిస్తాయేమోనని ఎంతో దిగులుపడ్డాడు

సోమిదేవమ్మ ఆనాటివేళ పొద్దుటినించి తేలికగానే తిరిగింది కాని దీపాలవేళ నొప్పులు ప్రారంభమయ్యాయి మధ్య మధ్యన కొంచెం తగ్గినా క్రమక్రమంగా ఎక్కువయ్యాయి వూచలు విరిగిన గొడుగు విప్పి ఎదురుగాలిలో అతి ప్రయాస మీద ఎత్తిపట్టుకుని మంత్రసాని యింటికి, డాక్టరమ్మ భవంతికి పరుగులు పెట్టాడు రావు ఇంటిలో పిల్లల నందరిని సముదాయిస్తూ అవసరాలకి ఆదుకునే భారం పెద్దమ్మాయి మీద పడింది

చిన్న ముసురు క్రమక్రమంగా చినికి చినికి గాలివాన అయింది హోరు గాలికి కిటికీ తలుపులు మాటిమాటికి టపటప కొట్టుకున్నాయి ఒక్కసారిగా లైట్లన్నీ ఆరిపోయాయి పిల్లలంతా ఎంతో బెంబేలుపడి దిగాలుపడి కూర్చున్నారు రావు

హారికేన్‌లాంతరు, పెట్టెలో దాచిపెట్టుకున్న కొవ్వొత్తులు వెలిగించాడు.

అంతలోనే లైట్లన్నీ వెలిగాయి. అమ్మయ్యా! అనుకున్నాడు. అరుగుమీద చతికిలపడి భార్య అరచినప్పుడల్లా గుండె చేత్తో పట్టుకున్నాడు. ఒక్కొక్కసారి మెరుపు మెరిసినప్పుడు అతని కెదురుగా స్తంభంమీద ఉన్న బల్లి కళ్ళు రెండు తళతళ మెరిశాయి. వానలో తడుస్తున్న పొరుగింటి ఆవు అంబా అని అరిచింది. బొద్దింకలు వెల్తురు భరించలేక హఠాత్తుగా అటు ఇటు పరుగులు పెట్టాయి. చలిచీమలబారు ఆ లోకాందోళన తనకేమి పట్టనట్టు నిర్లిప్తంగా, నిటారుగా సాగిపోయింది. వాన నీళ్ళు చూరులలోంచి ధారలు కట్టి ప్రవహించాయి. అతని నడినెత్తిమీద టపటపమని నాలుగైదు చినుకులు పడ్డాయి. అంతలోనే సామిదేవమ్మ కెవ్వుమని కేక పెట్టింది. రావు ఉలిక్కిపడి లేచి నిలుచున్నాడు. తిరిగి తమాయించుకుని కూర్చుని ఎడతెగని ఆలోచనలో పడ్డాడు. భార్య ఆ గండం గడిచి బయట పడుతుందో పడదో అన్న భయం అతని నవనాడులు కుంగదీసింది.

చిన్నతనంలో క్రమక్రమంగా తల్లిదండ్రులిద్దరు గతించినప్పటినించి అతని జీవితం అంతా ఇంచుమించుగా కష్టాల నిచ్చెన మెట్లెక్కుతూన్నట్లే గడిచిపోయింది. రెండు మూడు సారులు స్కూలుఫైనలు తప్పి మరి గత్యంతరంలేక కోమటి గుమాస్తాగా కుదురుకున్నాడు. ఆ ఉద్యోగం అట్టే కాలం నిలవలేదు. ఆ తరవాత అతనికి అధమం రెండేళ్ల కొకసారి అయినా పొట్ట చేత్తో పట్టుకుని ఉద్యోగంకోసం పాకులాడడం తప్పలేదు. మరి కొంతకాలానికి కలెక్టరాఫీసులో అటెండరు పని దొరికింది.

రావు చాలా భయస్థుడు. ప్రతి చిన్న పై అధికారికి అగ్గగ్గలాడిపోతూ హడలిపోతూంటాడు అయినా అతనికి జీవితంలో 'రేపటి మాటేమిటి?' అన్న భయం తప్పలేదు. తలుచుకొంటే అతనికి కిన్నాళ్లనించి గడిచిన జీవితం అంతా భయంకర కారాగారంలా కనిపించింది. అది ముందు ముందు ఇంకా పరమ దారుణంగా పరిణమించేటట్టుంది 'తండ్రీ! ఏడుకొండలవాడా! నా కెన్నటికయినా ఈ ఖైదులోనించి విడుదల అన్నమాట వినబడుతుందా?' అని మనస్సులో ఎలుగెత్తి ఆక్రోశించాడు. రెండు చేతులు పైకెత్తి నమస్కరించి భార్య సుఖంగా బయటపడాలని ఆపద ముడుపు మొక్కుకున్నాడు. అదే సమయంలో ఇంటిలో ఎడపిల్ల ఏడుపు వినబడింది.

అంతలోనే లేడీ డాక్టరు ఆదరా బాదరాగా ఇవతలికి వచ్చి నీళ్ళు నమిలింది.

'ఆ అమ్మ పరిస్థితి ఏమి బాగాలేదు. స్పృహ తప్పి పడిపోయింది. ఇప్పుడే ఒక ఇంజక్షను ఇచ్చాను నాడి బాగా అందుకుంటే సరేసరి! లేకపోతే ముందుగానే తొందరగా ఆస్పత్రిలో జేర్పడం మంచిది.'

'ఇంతవరకు వస్తుందేమో అని నేను ముందే అనుకున్నాను. కాని నా మాట వినిపించుకుంటేనా? ఏమిచెయ్యను? నా ఖర్మ! ఈ ఆడ డాక్టర్లంతా ఇంతే!'

మనస్సులో సణుక్కుంటూ రావు టాక్సీ కోసం గబగబా వీధిలోకి పరుగెత్తాడు. ఆ తొందరలో బురదలో కాలుజారి పడవలసిందే! కాని నిలువదొక్కుకున్నాడు. ఎంత వెతికినా ఆ ముసురుల్లో అతని కెక్కడ టాక్సీ కనబడలేదు. అంతలోనే ఇంటిదగ్గర భార్య పరిస్థితి ఎలాగున్నదో అన్న ఆందోళన పట్టుకుంది. పోనీ, అవసరమయితే మళ్లీ వచ్చి టాక్సీ వెతకవచ్చునని నిశ్చయించుకుని తొందర తొందరగా ఇంటివేపు నడిచిపోయాడు. అప్పటికప్పుడే తెల్లవారేవేళ దగ్గిర పడింది. ముసురు బాగా తగ్గింది. ఆవేళ కృష్ణాష్టమి. వీధి వీధి అంతా పండుగ హంగామాతో మేలుకుంది. ఇరుగు పొరుగమ్మలు కొందరు వాకిళ్లముందు కళ్లాపి చల్లి ముగ్గులు పెడుతున్నారు. రావు భార్య పరిస్థితి తలుచుకుని ఉసూరుమని నిట్టూర్చి 'కిందటి పండుగనాడు అందరం సుఖంగా ఉన్నాము. ఈనాడేమి పుట్టిములక రానున్నదో అని ఎంతో కంగారు పడ్డాడు. గబగబా ఇంట్లోకి వెళ్లి 'ఎలాగుంది పరిస్థితి?' అని ఎంతో ఆత్రంగా అడిగాడు.

డాక్టరమ్మ తలుపోరగా ఉంచి ఇవతలికి వచ్చి మరి ప్రాణభయం లేదు! నాడి అందుకుంది. కాని ఇంకా బాగా స్పృహ రాలేదు. మొగపిల్లవాడు కలిగాడు. ఎందుచేతోగాని ఇంకా ఏడవడం లేదు.?' అని ఒక్క గుక్కలో చెప్పి క్షణంలో లోపలికి వెళ్లిపోయింది వాసుదేవరావు ఒకటి రెండు నిమిషాలపాటలాగే నిర్ఘాంతపడి నిలుచున్నాడు. అంతలోనే అతని శ్రుతి కుహరాలలో బంగారు మువ్వల గలగలలా పసిపాప ఏడుపు ప్రతిధ్వనించింది. సంతోషం పట్టలేక ఒక్క అంగలో పురిటి గది గుమ్మంముందు నిలుచున్నాడు.

చుట్టూరా మూగిన చీకటినించి, పాతకాలపు బూజులలోనించి బయటపడిన దీపకాంతి పొత్తిళ్లలో ఉన్న ఆ పసిపాప ముఖంమీద అలమోకగా ప్రసరించింది. ఆ చిన్నారి పసికందు ఈ లోకంలో వ్యాపిస్తున్న దురన్యాయాలు, దౌర్జన్యాలు పూర్తిగా తొలగించివేయాలని పిడికిళ్లు రెండు గట్టిగా అదిమిపట్టి అటు ఇటు వూగిస్తున్నాడు. దుర్మార్గులతో పోరాడుతూ గట్టి గావుకేక పెడుతూన్నట్టు గొంతెత్తి అరుస్తూ హెచ్చరిస్తున్నాడు. అతిలోక మార్దవంతో అరుస్తూ, సౌందర్యంతో తొణికిసలాడుతున్న ఆ పసిపాపకేసి చూడగానే రావు మనస్సులో కలకల లాడుతున్న పీడ కలలన్నీ క్షణంలో పటాపంచ లయినాయి. పండుగనాడు పుట్టిన ఆ మగపిల్లవాడివల్ల ముందు కష్టాలన్ని గడిచి గట్టెక్క గలనని అత డెంతయినా మురిసిపోయాడు. ఆశ కాక మనిషికి లోకంలో వేరొక గట్టి ఆసరా ఏమి ఉంది! అదే నిమిషంలో సామిదేవమ్మ అరమూత కన్నుగవతో ముత్యంవంటి చిరునవ్వుతో భర్తకేసి, పాపకేసి తిరిగి అతని సంతోషం సరిసమానంగా పంచుకుంది. ఆనాటి పండుగ కోలాహలంతో వీధివీధి అంతా కలకల లాడింది!





"భోజనం చేశావా?"

"అమ్మయ్యో! మీపని పూర్తి చెయ్యకుండనా?"

"భోజనం ఇక్కడ చేద్దువుగానిలే! మీ మామయ్య దగ్గర కావలసినంత రొట్టివుందా?"

"కొంచెం ఉందండీ! కాని మందు

## కొలంబా

21 వ పేజీ తరువాయి

గుండు లేదు. కొనటానికి 'చెస్ట్ నట్' (chest nut) ఉందిగా. ఇప్పుడు మందుగుండే అత్యవసరం!"

"రొట్టె, మందుగుండు రెండు ఇప్పిస్తాలే."

"కొలంబా" అన్నాడు ఆగ్నే గ్రైవిలో "ఈ ధర్మమంతా ఎవరికి?"

"మన ఊరిలో ఒక బందిపోటు దొంగకి, పాపం!" అంది కొలంబా అదే భాషలో. "ఈ చిన్నమ్మాయి మామ."

"నీ దానకర్మాలు ఇంతకన్నా మంచివాళ్లకి లేవా? దొంగతనం చేసేవాడికి మందుగుండు ఇవ్వట మేమిటి? ఇలా వారిని దగ్గిరికి తియ్యడంవల్లనే ఈ దేశంలో దొంగతనా లింకా సాగుతున్నాయి"

"పాపం వాళ్లు చాలాబీదవాళ్లు."

"బీదవాళ్లయితే రొట్టి ఇవ్వుగాని మందుసామగ్రి ఎందుకివ్వటం?"

"అన్నయ్యా," అన్నది గంభీరంగా. "ఈఇంటికి యజమానివి నువ్వు. నీ ఇష్టమే కానీ. కానీ, ఈచిన్నమ్మాయికి నా 'మెజారో' (తలకి వేసుకునే మేలిముసుగు వంటిది—అ.) ఇస్తాను దాన్ని అమ్మి మందుగుండు తెచ్చుకుంటుంది. మందుగుండు ఇవ్వనంటవూ! వారిమీద పోలీసులు దాడిచేస్తే ఎలా రక్షించుకుంటారు? ఏమిచేస్తారు?"

చిన్నఅమ్మాయి ఆకలిగా తన కిచ్చిన రొట్టెముక్క తింటూ కొలంబా వంకా, ఆరోస్ వంకా కుతూహలంగా చూస్తూ ఉండిపోయింది. వారి ముఖకవళికలనిపట్టి వారి మాటలు అర్థం చేసుకుందా మనుకుంది కాబోలు.

"అసలు ఈ బందిపోటు చేసిన నేరం ఏమిటి?"

"బ్రాందోలాచ్చియో నేరం చెయ్యలేదు!" అన్నది కొలంబా గట్టిగా. "తనతండ్రిని హత్యచేసిన జియావాన్ బపిజ్జోని చంపేశాడు."

ఆరోస్ అటువైపుతిరిగి, మాట్లాడకుండా దీపం తీసుకుని తనగదిలోకి వెళ్లిపోయాడు. కొలంబా ఆచిన్నపిల్లకి మందుగుండు, వంటసామగ్రి కొంతా ఇచ్చి పంపించి వేసింది. అయితే, "మామామతో ఆరోస్ విషయం బాగా కనిపెడుతూ వుండటము అన్నిటికన్నా ముఖ్యమని చెప్పు!" అని మరీ సాగనంపింది.

ఆరోస్ చాలా సేపు నిద్రపోయాడు. లేచేటప్పటికి బాగా ఆలస్యం అయింది. సాధారణంగా కార్సికన్లు పెందరాళే లేస్తారు. కళ్ళు తెరవగానే తమ శత్రువుల ఇంట్లో యుద్ధసన్నాహాలు జరగడం చూశాడు. కిందికివెళ్ళి తన చెల్లెలు ఎక్కడ అని పరిచారికని అడిగాడు. "గుళ్ళుచేసే చోట ఉంది" అని చెప్పింది సవెరియా (పరిచారిక పేరు) అడుగడుగునా పోరాటానికి సంబంధించిన విషయాలే ఎదురు అవుతున్నాయి అతనికి

---

ఇటీవల ఒక స్కూలు ట్రస్టీగారికి ఇన్కంటాక్సు వారివద్దనుంచి టెలిఫోన్ వచ్చింది.

"ఫలానా, ఫలానా షావుకారుగారు మీ బడికి వెయ్యి రూపాయలు ఇచ్చారంటున్నారు నిజమేనా?" అని.

"ఇంకా ఇవ్వలేదు. కాని ఇక ఇస్తారులెండి" అని ట్రస్టీగారి సమాధానం.

ఎ. వి. ఆర్. (మద్రాసు)

---

కొలంబా ఒక చిన్న చెక్క బల్లమీద కూర్చుని బంకమట్టి అచ్చులలోనుంచి పోతపోసిన తుపాకి గుళ్ళు తీస్తోంది.

"ఏమిటీ ఘోరం?" అన్నాడు ఆమె అన్నగారు.

"కర్నల్ గారి తుపాకికి కావలసిన గుళ్ళు నీ దగ్గర లేవు," అన్నది ఆమె నెమ్మదిగా. "సరయిన అచ్చు దొరికింది. ఎనభయి గుళ్ళు తయారుచేశాను."

"అన్ని నాకనవసరం; భగవంతుడా!"

"అజాగ్రత్తవల్ల నష్టపడకూడదు ఆరోస్ ఆంటన్—నీ దేశాన్ని నీ చుట్టూ ఉన్న మనుషుల్ని మర్చిపోతున్నావు!"

"నువ్వు జ్ఞాపకం చెయ్యకపోతే మర్చిపోయేవాడినేమో! సరే గాని, నాకోసం పెద్దపెట్టె ఏదయినా వచ్చిందా?"

"వచ్చిందన్నయ్యా. నీగదిలో పెట్టనా."

"నువ్వు పెడతావా? అసలు దానిని ఎత్తేబలం నీకుండద్దూ... మగవాడెవడూ లేడూ?"

"నువ్వనుకున్నంత బలం లేనిదాన్ని కాను నేను" అన్నది కొలంబా తన చొక్కా చేతులు పైకి లాగుతూ. జబ్బలు తెల్లగా, గుండ్రంగా కనిపించినా కావలసినంత బలం కలవి, అని తెలుస్తూనే వుంది. "రా, సవెరియా," అన్నది పరిచారికతో. "నాకు సాయంపట్టు"అని బరువైనపెట్టె పైకిఎత్తింది. ఇంతలో ఆరోస్ ఆమెకి సహాయపడటానికి సిద్ధంఅయ్యాడు.

"ఈపెట్టెలో నీకోసం తెచ్చిన దేదో వుంది కొలంబా. నా బహుమానాలు చవకగా ఉంటే క్షమించు. కాని లెఫ్టినెంట్, అందులో సగం జీతంమీదఉన్నవాడిజీతం తక్కువే" అంటూ ఆరోస్ పెట్టెతెరిచి కొన్ని దుస్తులు బయటికితీశాడు; చిన్నవయసులో వారు సాధారణంగా వాడే రకం వస్త్రాలు అవి.

"ఎంత బావున్నాయి!" అన్నది కొలంబా. "తొడుక్కుంటే నలిగిపోతాయేమోనని భయంగావుంది. ఇప్పటికి దాచేస్తాలే" అన్నది మళ్లీ. "నాన్నగారు పోయినందుకు ఇంకా 'శోకవస్త్రాలు' ధరిస్తూనేవున్నాను" కొలంబా తన అన్నగారిచెయ్యి పెదవులకి అద్దుకుంది.

# బహిష్టు రోజులలో ఉపశమనమునకు శాంతయొక్క ఉపాయము

బహిష్టు రోజుల్లో నాకు ఎంతో అసౌఖ్యముగా ఉంటోంది!

ఈ సారిడన్ వేసుకో నీకు స్వస్థత కలుగుతుంది

శాంత సారిడన్ వేసుకొనును

తరువాత:

ఆహా, ఎంత హాయి! సారిడన్ వేసుకోమన్న వదిన సలహా ఎంత మంచిది!

# సారిడన్ 'రోష్'

## నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును

కావిలో బహిష్టు రోజుల్లో అసౌఖ్యముతో కృంగిపోకండి — సారిడన్ వేసుకోండి. అది మీకు త్వరితముగ, నిరపాయముగ, నిశ్చయమైన విధములో ఉపశమనము కలిగిస్తుంది. తలనొప్పి, పంటినొప్పి, ఒంటినొప్పి, జ్వర చిహ్నములు మరియు మామూలు అస్వస్థతలకు కూడ సారిడన్ అద్భుతముగా గుణము కలిగిస్తుంది.




ఒకే సారిడన్ బిళ్ళ చాలును
ఒక బిళ్ళ ఖరీదు 13 నయా పైసలు

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

[WT VT-4798 Al]

## కొలంబా

"ఇంత కాలం శోకంలోనే ఉన్నావంటే నీ ప్రేమ ఎంత అపారమైనదో తెలుస్తోంది చెల్లాయ్!"

"నా నిర్ణయం వేరు" అన్నది కొలంబా దృఢమయిన స్వరంతో. "ఈవస్త్రాలు ఇంకా వదిలివెయ్యదలుచుకోలేదు" అంటూ బారిచినీ ఇంటివైపు చూసింది

"పెళ్లి అయేవరకూ నా?" అన్నాడు మాట పూర్తిచెయ్యపోయి.

"నాకోసం మూడు పనులు సాధించే అతన్ని తప్ప పెళ్లిచేసుకోను..." అంది కొలంబా ఇంకా శత్రువు ఇంటివైపే చూస్తూ.

"నీవంటి చక్కని పిల్లకి ఇంకా పెళ్ళికాలేదంటే ఆశ్చర్యంగా వుంది కొలంబా! నిన్నెవరెవరు వరిస్తున్నారో చెప్పు వింటాను. అయినా నీవంటి ఆశుకవయిత్రికి ప్రేమ వల్లించే అబ్బాయికి చాలాకష్టం."

"ఒక బీద అనాధని కోరేవారెవరు? నన్ను పెళ్ళిచేసుకోవాలనుకునే మనిషి ఇంకొక ఇద్దరు స్త్రీలు శోకవస్త్రాలు ధరించేట్లు చెయ్యాలి కదా!"

"అదేం తెలివితక్కువ మాటలు!" అన్నాడు ఆర్సో కాని, ఆవిషయం చర్చించలేదు.

"అన్నయ్యా" అంది కొలంబా బుజ్జగించే స్వరంలో. "నేనూ నీకొక బహుమతి ఇస్తాను. నీబట్టలు ఈ దేశానికి తగవు. మరీ నాజూకుగా వున్నాయి. పొదల్లో తిరిగావంటే రెండురోజుల్లో నీ ఎర్రకోటు చిరిగి పేలికలైపోతుంది మిస్ నెవిల్ కోసం దాచిపెట్టు దాన్ని. "ఒక అలమారా తెరిచి వేటకి పనికివచ్చే దుస్తులు బయటికితీసింది. ఇదిగో వెల్వెట్ చొక్కా ఒకటి చేశాను ఇక్కడ నాగరికులు పెట్టుకొనే టోపీ ఇదిగో. దీన్ని ఎంబ్రాయిడరీ చెయ్యటానికి చాలాకాలం పట్టిందనుకో! ఏదీ పెట్టుకుని చూస్తావా?"

పెద్దజేబు ఉన్న ఒక వెల్వెట్ చొక్కా ఇచ్చింది. చివర కుచ్చు ఉన్న నల్లటి వెల్వెట్ టోపీ తల మీద పెట్టింది.

"నాన్నగారి తుపాకి బెల్టు ఇదుగో ఆయన కత్తి జేబులో ఉంది పిస్తోలు వెతికి తీసుకొస్తాను."

"కామిక్ బందిపోటులాగా వున్నానా?" అన్నాడు ఆర్సో, సవెరియా తీసుకువచ్చిన చిన్న అద్దంలో చూసుకుంటూ.

"ఈ బట్టల్లో చక్కగా ఉన్నావనుకో ఆర్సో ఆంటన్" అంది సవెరియా ఆమె వీళ్ళ ఇంట్లో ఎన్నో సంవత్సరాలుగా పని చేస్తోంది.

ఆర్సో అదే దుస్తులతో భోజనానికి కూర్చున్నాడు. భోజనంచేస్తూ తన పెట్టెలో కొన్ని పుస్తకాలు ఉన్నాయని చెల్లెలికి చెప్పాడు. ఫ్రెంచి, ఇటాలియన్‌లలో మంచి కృషిచెయ్యాలన్నాడు "నీ అంత పెద్ద అమ్మాయికి యూరోప్‌లో దాదులు దగ్గర ఉండే చిన్న పిల్లకి తెలిసినంత కూడా తెలియకపోవటం సిగ్గుపడవలసిన విషయం" అన్నాడు.

"నిజమే అన్నయ్యా" అంది కొలంబా. నా లోపాలు నాకు తెలుసు నువ్వు నేర్పితే నేర్చుకొనటానికి సిద్ధంగా ఉన్నాను.

(ఇంకా ఉంది)

# ప్రేమకు పగ్గాలు

13 వ పేజీ తరువాయి

స్తున్నది. కాని "అమ్మతో ఎలా చెప్పను . తనను మభ్యపెట్టి తెచ్చానే, యీ వాల్తేరు ?" అనుకుం టుంది ఒకసారి.

మం సారి తనది కేవలం భ్రమ అనీ ఉత్త అనుమానమనీ, "భాస్కరంగారు అనేకమైన బరువు బాధ్యతల మధ్య తనను కాస్త ఉపేక్షిస్తున్నాడేమో న"ని తలపోస్తున్నది.

"ఆయనగారికి యీ ఏడాది ఫైనల్ యియర్ పైగా చెల్లెలి పెళ్లి అంటే మాటలా ? రక రకాల పనులూ, బాధ్యతలూ ఉంటాయి" అను కుంటుంది.

కాని గుంటూరులో అన్ని సినిమాలకు తన్ను దొంగ తనంగా తీసుకెళ్లిన భాస్కరం బెజవాడలో కృష్ణానది ఒడ్డున రాత్రి ఆఖరి రైలుదాకా తనను కబుర్లు చెబుతూ "వదలలేను పద్మా ! నేను నీకు బందీ" ని అన్న భాస్కరం—వాల్తేరు వొచ్చాక కనీసం ఒక్క సినిమాకేనా రమ్మనలేదే. సాయంకాలం సముద్రం—తను ఇదివరకెన్నడూ ఎరుగని సముద్రం — "చూద్దాంరా !" అనేనా పిలవలేదే ."

అదే పద్మావతి గుండెలు పిండేసింది. తాను భాస్కరంమీద పెట్టుకున్న ఆశ వేరు. అది అతని యింటికి యిల్లాలై వెళ్లాలనే—అతని స్నేహం గంటే ఎక్కువ—అతని రక్షణ, తాను కోరు కున్నది.

పద్మావతి సరిగ్గా అన్నం తినలేదని జయమ్మ గారు చాలా నొచ్చుకున్నది

"ఈ పొడు పూరు—ఈ తిండీ నీకు పడటం లేదే అమ్మాయీ !" అనుకున్నది.

"చివరికి నేను దీని పెళ్లి గురించి ఆలోచనే చెయ్యలేక పోతున్నాను .. ఛీ ! కర్మ" అనుకుంది. కాని తను ఎవరిని సంప్రదిస్తుంది ? ఎవరున్నారు తనకి ?

* * *

పద్మావతి పుస్తకాలు సర్దుకుని కలం మరిచిపోయి వెళ్లిపోతూండటం జయమ్మగారు గమనించింది.

"అమ్మాయ్ ! అంత పరధ్యానంగా ఉన్నావేమే ?" నన్నది కలం తీసి గుమ్మంలోకి వచ్చి కూతుర్ని వెనక్కి పిలిచి అందిస్తూ.

పద్మావతి సురేఖనే, యిదివరకు అడిగేది అన్నీ ఇప్పుడు అడగాలనిపించడం లేదు. క్లాసుల్లో కూడా ఎప్పుడూ సురేఖ ప్రక్కన కూర్చునే పద్మావతి, ఎడంగా కూర్చున్నది. సురేఖ కూడా 'ఏమని' అడగలేదు.

ఆ యిద్దరిమధ్య భాస్కరమనే గోడ పెరిగి పెద్దదై పెద్దదై పోతున్నది.

భాస్కరం ఇక ఒకటి రెండు నెలల్లో ఇంటికి వెళ్లాలి. .... ఈలోగా ఈ ఎక్స్‌పెరిమెంట్ చేసు కోవాలి. ఈ నోట్సు రాసుకోవాలి అనే ఆదు ర్దాలో పడిపోయాడు.

* * *

ఒకనాడు మూర్తి వచ్చాడు వస్తూనే తాను శైలజతో పరిచయ మేర్పరచుకున్నానని చెప్పాడు.

భాస్కరం ఇనార్గానిక్ మెటల్స్ చదువు కుంటున్నాడు. "కాస్త చదువు సంగతి పట్టించు కోరా" అన్నాడు మిత్రుణ్ణి మందలింపుగా చూసి.

"అంటే నీ ఉద్దేశం ... శైలజని మరిచిపో మంటావు ... ?" అడిగాడు మూర్తి.

"ఉహూఁ .. ఎందుకంటాను . కానీ .. "

నీళ్లు నమిలాడు భాస్కరం

"నువ్వు పద్మావతిని మరిచిపోయినట్లేనా ?" అడిగాడు చటుక్కున మూర్తి.

"షటప్!" మండిపోయాడు భాస్కరం. అంతలో సిగ్గుపడిపోయి "క్షమించరా ! నాకే మధ్య బుర్ర బాగోలేదు" అన్నాడు మూర్తి చేతులు పట్టుకుని

మూర్తి కూడా తన తొందరపాటుకి నొచ్చుకున్నాడు. "కాదురా! యీమధ్య నువ్వూ .." అని ఏదో చెప్పబోయాడు. మూర్తి అంతలో మనసు మార్చుకుని "ఏం లేదులే ! ఐవిల్ కమ్ ఎగైన్" అంటూ వెళ్లిపోయాడు

భాస్కరం విచారంగా కూలబడ్డాడు. శైలజా, పద్మావతి, సురేఖ, మూర్తి ఎవరప్పని, పిల్లకు పిళ్ళేనా ? బాధ్యులు .. ...

ఇవాళ యీ పెరిగిన కండలకు, అందాలకు మరొకరి సొత్తు మరొకరి శక్తి వెచ్చమయింది. అందుకే మరి ... ..

మూర్తిని వెనక్కి పిలిచి క్షమాపణ చెప్పకుండా మనిపించింది . కాని ఏం లాభం ? వాడన్నది నిజమే. తాను పద్మావతిని ఎన్నోరోజులైంది కల్సుకుని. సురేఖకు అవకాయ ఇచ్చి రావాలి అనుకుంటూనే రెండు వారాలైపోయింది—అసలా అవకాయ ఎలాగుందో ...... ?

"ఎంత బుద్ధితక్కువ పని ? వెధవది క్లాసు పుస్తకాలు పట్టుకుని వెళ్లాలీ అంటే సిగ్గేస్తుంది కదా ? ఈ అవకాయ యిస్తానని తద్దినం తెచ్చుకున్నానేమిరా భగవంతుడా ?" అనుకున్నాడు.

భాస్కరానికి భయం వేసింది. బెంగగా ఉంది—ఒకవేళ పద్మావతి తొందరపడి తన మీద కోపంతో చదువు మానేయదు కదా ?— భయం వేసింది.

"ఉహూఁ ... ఎందుకు మానేస్తుంది ? జయమ్మగారు వూరుకుంటుందా ?" అనుకున్నాడు

మనసు ఇంటిదగ్గర ఒకసారి—పద్మావతి కేసి ఒకసారి సురేఖ గురించి ఇంకోసారి పీకుతున్నది.

'వసంత'—తను ఎత్తుకొని ఆడించిన వసంత .. పెరిగింది. పెద్దదైంది .... ఇక రెండు మాసాల్లో పరాయిదై పోతుంది

నవ్వుకున్నాడు "పరాయి దవడం అంటే ? వసంత తన సొత్తా ? పిన్నమ్మ సొంత ధనమా ? ఉహూఁ . . వసంత వసంతే అపిల్ల తన ఇంట ఉండటానికి లేదు మరొకరి యింట మరొక వ్యక్తి యిష్టా నిష్టాలకు అనుగుణంగా, మరో జీవితం, మరో యిల్లూ కట్టుకోవాల్సిందే"

పద్మావతి అంతే.

రేపు పిన్ని 'నువ్వు మాస్టరీ వద్దూ' అంటే ఆమె మానెయ్యాలి

"అంతేనా ?" అనుకున్నాడు గట్టిగా .... తీవ్రంగా ఆలోచిస్తున్నవాడు—కాలేజీ మెట్లు దిగుతూ,

ఔనన్నట్లు క్లాక్‌టవర్ మీది చతుర్ముఖ గడియారం "ఢంగు"న ఆరుసార్లు కొట్టింది

జయమ్మగారు "పిళ్లేడు .. మా అమ్మాయి పంతులమ్మ ఉద్యోగం చెయ్యాలి అని అదిరించి నేను ఊరుకోను అంటే .... ? "పిళ్లేడు" అంటుంది పిన్నమ్మ . అంతేగా !!

"హే భగవాన్ ! పద్మావతి కితను పరాయివాడు —వసంతకి ముకుందరావు పరాయివాడు—కాని యీ ఇద్దరికీ ఇష్టానిష్టాలు, అభిరుచులు సొంతానివి ఉండరాదు—"

"వసంతాలు రెండు జెడలు వేసుకున్నా—పంజాబీ దుస్తులు వేసుకున్నా అందంగా ఉంటుంది."

చెల్లెలు జ్ఞాపకంరాగానే తిన్నగా బజారుకు వెళ్లి చిన్న చిన్న పసుపు పచ్చని పూలుగల సిల్కు గుడ్డ తీసుకుందామనిపించింది భాస్కరానికి "దానికి నేను తప్పకుండా సూర్వా షేర్వాణీ కొంటాను—ఎవడు కాదంటాడో చూస్తాను" అనుకున్నాడు.

తిన్నగా 'ఔట్ గేట్' కు వెళ్లాడు. బస్సు కేసి నడిచాడు.

## 32

జానికమ్మగారికి ఈనిండా ఆలోచనలు చేతినిండా పనీ ఉంటున్నది. పెళ్లి అంటే మాటలా ?

**ఒక వ్యక్తి కొత్తగా సినిమా రంగంలో ప్రవేశించి చిత్రం ప్రారంభించాడు.**

**అయ్యా ! 'ఫిల్మ్ సిమెంట్' అయిపోయిందండీ అని కెమేరామాన్ చెప్పాడు.**

**మర్నాటి పొద్దుటికల్లా స్టూడియోలో ఆరుబస్తాల సిమెంటు (కట్టడాలకుపయోగించేది) తయారయింది.**

శ్రీదేవి (గుంటూరు)

—అందులోకి ఆడపిల్లను 'కన్నె ధార' పోయుడానికి ఎన్ని చూసుకోవాలి?

అప్పడాలు వొత్తాలి అందులోను "దింపుళ్ల అప్పడాలు విస్తళ్లంత వొత్తాలి" ఒడియాలు పెట్టాలి. పప్పుతో పదీ ఉప్పుతో పదీ అన్నీ సమకూర్చుకోవాలి—అన్నింటికన్నా ముఖ్యం—పిల్లది అత్తారింటికెళ్లిపోతుంది. దానికి నాలుగూ నేర్పాలి.

వసంతకు ప్రత్యేకంగా శిక్షణ నివ్వడంలో మునిగిపోయిందామె. ఇదివరకు రోజుకు పదిసార్లు తల్చుకునే భాస్కరాన్ని ఒకటి రెండుసార్లు కన్నా ఆమె ఎక్కువగా తల్చుకోవడంలేదు.

భాసడు తనవాడు వాడు పరాయివాడు కాడు. వాడు తన దగ్గరే—లేదా వాడి దగ్గరే తను ఉంటుంది గాని వసంత—వసంత పరాయి పిల్లయి పోతుంది.

జానికమ్మగారికి తన గుండెల్లోని నెత్తురు ఎవరో తోడుకుంటున్నట్లు అనిపించింది.

'కాని తప్పదు' అనుకుందామె

"వాడికి ఒక అమ్మగన్న బొమ్మను తేవాలి దీనిని ఒక అయ్య యింటికి దిగబెట్టాలి— ఈఋణంపుకోలనరజన్మకేఉన్నది" అనుకున్నదిఆమె.

"అమ్మయ్యో ! కట్నాలు యిచ్చి, వేలకు వేలు తగలేసి, నెత్తుర్దూ, చెమటా ఏకంచేసి, అన్ని లాంఛనాలు పూర్తిచేసి కాళ్లు కడిగి కన్యాదారపోస్తేనే .... అనక రాసి రంపాన పెట్టే గయ్యాళి అత్తగార్లూ, కాల్చుకుని తినే మొగుళ్లూ ఉంటారే లోకంలో—ఇక ఆయన అన్నట్లు కట్నం, చట్నం వొప్పేదూ అని ఆఖరి క్షణంలో అభాసు చేస్తే ఇక మయినా ఉందా ?—నా చిట్టితల్లి గతేం గాను ? "

ఆమె గుండె గతుక్కుమంది. ఎవరో పొడిచినట్లు!—అదుముకుంది.

"ఒరే ! తల్లీ ! వసంతా !" అని కేక వేసింది .. వసంత రాగానే దానిని గుండెలకు హత్తుకుని, ఏదో అనబోయి సంభాళించుకుని "నువ్వుపోయి అక్కడ నానబోసిన పప్పు గాలించు" అన్నది దూరంగా జరిగి.

గాలించడం, చెరగడం ఇవి రెండూ ఆడపిల్ల పనివాడితనానికీ గీటురాళ్లు—జానికమ్మగారు వసంతకు సంగీతం చెప్పించింది కాస్తో కూస్తో ఇంగ్లీషూ ఇంట్లోనూ అల్లికలూ కుట్లూ కూడా వసంతే కుతూహలంగా నేర్చుకుంది. గాని, అసలైన విద్య, అత్తగారు దెప్పి పొడవకుండా కాపాడగల శాస్త్రమూ అయిన వంటా, వార్పూ, అవే యింకా ముక్కుపచ్చలారని ఈ పసిదానికి పస్తాయో రావోనని జానికమ్మగారికి ఆరాటం ఆడపిల్లకి పది రకాల అవకాశాలు, చనువులూ ఉండవు. చాలా విషయాల్లో తల్లిగన్నా గురువూ, నేస్తమూ మరెవ్వరూ ఉండరు.

వసంతకు తను వండటంలోనూ, అత్తమామలకు సేవ చేయటంలోను భంగపడతాననే భయం అసలు కలగనే లేదు తనకు కాబోయే వరుడు "అన్నయ్యంత తెలివైనవాడేనా ? అంత చురుకుగా ఉంటాడా ?" అన్నదే ఆలోచన. అంతే అమ్మ చాదస్తం కాదనలేక, వంట వండటం పట్ల శ్రద్ధ చూపుతున్నట్లు నటిస్తుంది.

"అమ్మా ! ఆవకాయ కష్టంగదే" అంటుంది.

"కష్టమూ అంటే కాదనుకో గాని కాస్త రుబ్బుతున్నప్పుడు చెయ్యి మండుతుంది . వెంటనే చేతికి శుభ్రంగా కడుక్కుని వ్యాసలీనో, కొబ్బరి నూనో రాసుకోవాలి" అంటుంది జానికమ్మగారు.

ఆమె కూతురికి ఆవేళ మధ్యాహ్నం రెండు జెడలు వేసింది.

"అన్నయ్య వూళ్లో లేడే" నన్నది వసంత — తల్లికి జ్ఞాపకం చేయడానికి

"బాగుంది తెలివి .. నాకు తెలీదా ? ఏమిటీ? కాని వాడికి సర్దా అయిన నాలుగూ నీకు అలంకారంగా చేస్తే నా కదో తృప్తి—వాడి మాటైనా నా హయామయినా యింకెన్నాళ్లు చెల్లాలి ? .. రేపు మీ అత్తారింట వాళ్ల యిష్టం" ఆమె నిట్టూర్చింది.

"పోమ్మా" వసంత నొచ్చుకుంది. "నాకు పెళ్లే వొద్దూ" అంది

"ఛీ ! ఛీ ! అవేం మాటలే ? శుభం కోరా పెళ్లికొడకా అంటే అలివేలుకుండకాడ చచ్చినట్లు తొంగుంటా నన్నాట్టలే ఎవడో పిలాంటి వాడే" ఆమె కూతుర్ని మందలింపుగా, ఆప్యాయంగా ఒక్క చరుపు వీపుమీద చరిచింది.

"భాసడికి నచ్చిన పిల్ల వస్తే దానికీ ఈ రెండు జెడలు వొద్దనను ?" ఆమె స్వగతంలా అనుకుంది.

# ప్రేమకు పగ్గాలు

"అమ్మా! తను వొద్దంటాడే. .."అన్నది వసంత.

"ఏం . . ఎందుకనీ . ..."

"నీకు నచ్చదని" వసంత నవ్వింది

"బాగుంది వరస .. నేను నీకూ, మీ అన్నయ్యకూ అంత గయ్యాళి అత్తగారిలా అగుపిస్తున్నానా ?" ఆమె సర్దాగా నొచ్చుకుంది

"ఊహూఁ నాకు తెలీదు; అన్నయ్య నీమాట వింటాడూ అన్నా నంతే" నంది వసంత—తల్లి అల్లిన జడ ఒకటి ముందుకు వేసుకుని చూసుకుంటూ

"కాని ఆ సురేఖ అనే అమ్మాయి గురించి వాడికేమో పూర్తిగా యిష్టముందాని ? అనుమానంగా ఉంది ?" జానికమ్మగా రాలోచించుకుంటున్నది.

వసంత మాట్లాడలేదు సురేఖ అంటే అన్నయ్యకు ఎందుకు నచ్చలేదో తనకే తెలియదు. పైగా అమ్మతో ఏమాట అన్నా ప్రమాదమేనని వూరుకుంది

"తప్పకండా వాడికి పై యేటికి పెళ్లిచేసి తీరుతా" నన్నది భాస్కరం గురించే ఆలోచిస్తున్న జానికమ్మగారు కూడా "ఇదీగాక యీ సురేఖ లాంటి పిల్ల మనకు ఎలా దొరుకుతుందీ" అన్నదామె అప్పుడు ఆమె సంప్రదించగల పెద్ద ముత్తయిదువ లెవరూ లేరు అందుచేత వసంత తోనే ఆమె ఉద్దేశాల చెప్పి బలపర్చుకోవాలి

"ఈ సురేఖ ఒక్కగా నొక్క పిల్ల. పైగా ధనమ్మగారు మంచి సంప్రదాయం, హుందాతనం రెండూ గల ఫక్కీలో దీనిని పెంచి పెద్ద చేసింది. —కాని భాసడు కట్నం వొద్దు అనడంలోని అర్థమేమిటో నాకు తెలీలే దమ్మాయ్ !" ఆమె 'జెడలు' పూర్తిచేసి లాగిచూసి సర్దుబాటుచేస్తూ అన్నది

"నువ్వు వాదినెకు బంగారం పెడ్తానన్నా వొప్పుకోడేమోనే "

"వా డెవడే ? వొప్పుకుందికి ?! విన్నగాక మొన్నటివరకూ తిండి తినిపిస్తేగాని తినలేనివాడు" ఆమె మండిపడ్డది. "నా యిష్టం—నా కోడలికి బంగారమే పెడతానో, చెవులు మలిపి చేతులోనే పెడ్తానో. .."ఆమె అంతలో నవ్వి "కావాలంటే నాళ్ల వెళ్లివి నువ్వున్నావుగా నీకు మానేస్తానం" ది.

"నీ యిష్టం ! ఎప్పటికైనా నేను పరాయి దాన్నేగా" అనుకోకండా వచ్చేశాయి వసంత నోటి వెంట ఆ మాటలు

జానికమ్మగారు చలించిపోయింది పిల్లను చేర దీసింది కన్నీ రొత్తుకుని "నీకంతా మగపిల్లలే పుట్టాలని ఆ పార్వతీదేవిని ప్రార్థిస్తున్నాను" అన్నది

జానికమ్మగారికి వసంత పెళ్లి పనులమీద ఎంత ధ్యాన మున్నదో భాస్కరం మొండితనం మీదా అంత ధ్యాస ఉంది "ఒప్పుకున్నాడే గాని వాడికి యిష్టంలేదు" అన్న మాటలు ఆమె హృదాంతరాళంలో ధ్వనిస్తున్నాయి

"వీడు ఒకవేళ ఏ పిల్లదాని వలలోనేనా పడలేదుగదా ... ?"

కాని ఎవరితోనూ అమాట అనడం ఆమెకు యిష్టంలేదు. అఖరికి భర్తతో కూడా అనడం యిష్టంలేదు. **(ఇంకా వుంది)**

ఆమె (ఆ ఫోటోలో) అందంగా, ఆకర్షణీయంగా అలంకరించుకుని, చేతిలో దంతం హోల్డర్‌లో ఉన్న సిగరెట్టు పట్టుకుని, లాపోలా నగేరీ అపర మోహినిలా ఉంది.

అదే రకమైన ఫోటోలు ఇంకా చాలా ఉన్నాయి. ఎమైల్ సజావయిన స్త్రీతో ఎన్నడూ సహవాసం చెయ్యలేదు అతని సాహవాస కత్తెలందరు చేకరకం బారెమెయిడ్‌లు, బజారు స్త్రీలు, పేర పొందిన పతితలు మాత్రమే!! అతని చిన్న శరీరం, కుంచిత బుద్ధులు, ప్రపంచమంతా వార్లకు పోదామనే దురాశ, యునైటెడ్ స్టేట్స్ అంతా కబళించి వేద్దామనే ఆశ అన్నీకలిసి ఈ రకం అలికి జనం మీద దురభిమానంగా మారాయన కుంటాను

మొట్ట మొదట 1937లో ఎమైల్ నాకు తారసపడి చివరికి సంకటంగా తయారయ్యాడు. ట్రాయిస్‌లో రెండు బ్యాంకుల్లో నుంచి 1,800,000 ఫ్రాంక్స్‌లు దొంగిలించి పరారీ అయ్యాడు ఆదోపిడి చాలా జాగ్రత్తగా ప్లాను వేసుకుమరీ చేశాడు. ట్రాయిస్ నుంచి పారిస్ పారిపోడానికి అనువుగా జనసంచారం లేని సందులు గుండా, మార్గాల గుండా దారి నిర్ణయించ కున్నాడు ఆ మార్గం బాగా అవగాహన చేసుకోడానికి దోపిడీ నాటి రాత్రికి ముందు ఆ 110 మైళ్ళ మార్గంగుండా కారులో సుమారు అరడజను సార్లు తిరిగాడు

ఒక వేళ ఆ మార్గం గుండా పారిపోడానికి కుదరకపోతే తప్పించుకోడానికి మరో ఎత్తు కూడా వేశాడు ట్రాయిస్‌లో (మార్గాంతరం కోసం) ఒక షాపు అద్దెకు తీసుకుని అందులో 'తల' దాచుకోడానికి ఏర్పాట్లు చేసుకున్నాడు

ఎమైల్ పథకం చాలా చక్కగా నెరవేరింది. ట్రాయిస్‌లో దోపిడీ చేసి ఒక కార్లో ట్రాయిస్ పొలిమేర వరకూ వెళ్ళి అక్కడ వేచి ఉన్న మరో కారెక్కి పారిపోయాడు

ఈ దోపిడి విచారణ వచ్చేసరికి, బహుశా ఎమైల్ బోయిసన్ దీనికి బాధ్యుడని నాకు తోచింది. కాని సాక్ష్యం లేకపోయింది వెనుకటికి అతని మీద ఆరోపించిన పదమూడు నేరాలు కూడా సాక్ష్యాలు లేక నిలవలేదు ఈ సారి ఎలాగయినా అతన్ని బంధించాలని నిర్ణయించ కున్నాను

అనుకోకుండా అదృష్టం నన్ను వరించింది. ఎమైల్, అతని కొత్త ఉంపుడు కత్తె నడుపుతున్న హోటలు వెనుక భాగంలో ఒక రూములో నిద్ర పోతుండడం చూశాను నా అలికిడి అతను నిద్రలేచి, నన్ను గుర్తుపట్టి, బద్ధకంగా ఆవులిస్తూ,

"ఓ! ఇనస్పెక్టర్ చనివీర్గ్యారా! రండ్రండి, ట్రాయిస్ దోపిడీకి, నాకూ ఏమీ సంబంధం లేదని నిరూపించడానికి నాకు బలమైన సాక్ష్యం ఉంది" అన్నాడు

నేనో నిముషం కూర్చుని, వెళ్ళిపోడానికి టోపీ తీసుకుని నిలబడ్డాను. తలుపు వారగా ఉన్న ఒక గొడుగుమీద నా దృష్టి పడింది నా అదృష్టం కొద్దీ 'పొన్లే' అని వూర్కోలేదు దాన్ని ఎత్తి తల క్రిందులు చేశాను గొడుగు కొంచెం విడి, 1000 ఫ్రాంక్స్ గదంతా విదజల్లబడ్డాయి.

**నాతోపాటు ఎమైల్ కూడా ఆశ్చర్య పోయాడు**

# సింహస్వప్న నాయకుడు

27వ పేజీ తరువాయి

అవన్నీ బ్యాంకు దోపిడి చేసిన నోట్లే!!! అతని ఉంపుడు కత్తె తెలివి తక్కువ తనంవల్ల అలాటి చోట దాచిందనుకున్నాను.

ఆ విధంగా మొట్టమొదట ఎమైల్ నా చేత బంధింపబడ్డాడు.

కాని, ఫ్రెంచి కోర్టు తీర్పులు నాన్పుడు రకాలు. అతన్ని జైల్లో పెట్టి రెండేళ్లు దాటినా అతని శిక్ష ఇంకా నిర్ణయం అవలేదు. 1940 లో జర్మనీ వాళ్లు ఆదేశం ఆక్రమించుకున్న సందడిలో ఎమైల్ తప్పించుకు పారిపోయాడు

* * *

ఒక సంవత్సరం గడిచాక, మళ్ళీ పారిస్ బ్యాంక్ క్యాషియర్లిద్దరి మీద దాడిచేసి, ఒకణ్ణి నిర్దాక్షిణ్యంగా, అకారణంగా చంపివేసి, పరారైపోయాడు అతనికా దాడిలో సహాయం చేసిన

ఒకానొక పంతులుగారి షష్ఠి పూర్తి సభకు ఓ మంత్రిగారు అధ్యక్షత వహించారు పంతులు గారి గుణగణాలను మెచ్చుకుంటూ ఆయన ఉపన్యాసం ముగించే ముందు "పంతుళ్ళందరూ చిరకాలము వర్ధిల్లుదురుగాక" అని అన్నారు.

"ఏం చూసుకొని?" అని వెంటనే ప్రశ్నించాడు పంతులుగారి బాధ తెలిసిన తుంటరొకడు

రమణ (వల్లభాపురం)

ప్రఖ్యాత బ్యాంకు దోపిడిగాడు అబెల్‌డానోస్‌ని నేను ఉరికంబానికి పంపాను

ఎమైల్ మాత్రం చక్కగా నా ఉచ్చులోంచి చొచ్చుకు పోయాడు కానీ, రెండోసారి పట్టుబడడం మాత్రం చాలా తమాషాగా, దైవికంగా జరిగింది అవి యుద్ధాకాలపు ఓ రోజులు నాడుం ఎమైల్ ప్యారిస్ నుంచి మార్సేల్స్‌కు ప్రయాణం చేస్తున్నాడు కండక్టరు టిక్కెట్టు అడగడంవల్లను ఎమైల్ లేచి, పైనున్న పెట్టెమూత తీసి వెతుకుతూండేసరికి అతని బట్టల మధ్య నుంచి తూటా ఒకటి ఎగిరి, నిద్రపోతున్న జర్మన్ కార్పొరల్ నెత్తి మీద పడింది

అతను ఉలిక్కిపడి లేచాడు. నేలమీద తూటాని, తూటా పక్కన ఉన్న ఎమైల్‌ని చూశాడు. అనుమతి లేకుండా తుపాకులు తూటాలు పట్టుకుని ప్రయాణం చేస్తున్న నేరం మీద అతన్ని వెంటనే అరెస్టు చేశాడు

**ఎమైల్ మారు పేరుతో (మేటేడైర్ అనే పేర)** ఫోర్జరీ (దొంగ సంతకం) పేపర్లు తయారు చేసి ప్రయాణం చేస్తున్నాడు కూడా. కానీ హత్య, దోపిడి నేరాలమీద పట్టుబడ వలసినవాడు ఒక చిన్న నేరం మీద పట్టుబడ్డాడు

అతను జైల్లో ఉన్నట్టు నాకు తెలియగానే ట్రాయిస్ దోపిడేడి కేసుమీద అతన్ని మళ్ళీ బంధించి కోర్టు కెక్కించవచ్చు అనుకున్నాను ఈ కేసు ఫ్రెంచి కోర్టుకు సంబంధించినదే కాని నాజీ పార్టీకి సంబంధించినది కాదుగదా అనుకున్నాను.

కాని, విధి వ్యతిరేకించింది.

నాజీవాళ్లు అసహ్యించుకునే పోలీసు దళంలో నేను ఒకవాడి నయ్యాను. నాజీ పార్టీ రహస్య పోలీసు దళం అంటే నాకు పరమ అయిష్టం. ఆ దళంలో చేరడానికి అంగీకరించనందువల్ల నన్ను వాళ్ళు అరెస్టు చేసి, జైల్లో పారేశారు. తనని తరుముకువస్తూ నేనూ జైల్లో పడ్డానని తెలిసి ఎమైల్ బ్రహ్మానంద పడుంటా డనుకున్నాను. ఇరవై నాలుగ్గంటల్లో నన్ను 'బానిసగా నాజీ జర్మనీకి తోలేశారు. యుద్ధం అయ్యే వరకూ నే నిక్కడే నానా అగచాట్లు పడ్డాను.

* * *

నేను తిరిగి పారిస్ చేరాక మళ్ళీ అతని వేట ప్రారంభమయ్యింది.

ట్రాయిస్ సంఘటనవల్ల ఎమైల్ మూడేళ్ళు జైల్లో ఉన్నాడు. ఓ నాటి ఉదయం జైల్ గార్డు నీకేలేసి, వో బుడ్డిడు మంచినీళ్ళమ్మల అడిగాడు మంచినీళ్ళివ్వడానికి జైలు గార్డులోపలకు రాగానే, చటుక్కున అతని చేతిలో సీసా లాక్కుని బుర్ర పగలేసి చెంగున బయటికి గెంతి గేటు మూసి, "రేరే! ఖైదీ పారిపోతున్నా" డనే కేకల మధ్య దూడుకు పోయాడు

జైలు వార్డంతా గాలించారు. కొన్ని గంటలు గడిచాయి కానీ, అతని పత్తాలేదు ఆనక వెతగ్గా అతను జైలు లాండ్రీలో బీరువాలో కనబడ్డాడు. జైలు గార్డు అతన్ని వెలికి బైటకి లాగేసరికి మొరాయించి, మెలికలు తిరిగిపోయాడు

మనస్తత్వ శాస్త్రజ్ఞులు అతన్ని పరీక్షించి, అతని మనసు విచ్ఛిన్నమై పోయిందనీ, పారిస్ నగర సరిహద్దుల్లో నున్న 'విలిజుయిస్ పిచ్చాసుపత్రిలో కొన్నాళ్ళుంచాలని అభిప్రాయ పడ్డారు.

ఇదంతా నేననుకున్నట్టుగానే జరిగింది ఎమైల్ బాయిసన్ గుంటనక్కలాటి వాడు జైల్లోంచి కన్నా, పిచ్చాసుపత్రిలోంచి తప్పించుకు బైట పడడం అతి సులభమనుకున్నాడు. 1947లో అరదండాల్లో ఉండి కూడా అమితానందం పొందుతుంటా డనుకున్నాను

పారిపోడానికి ప్రయాణ సన్నాహాలు చేసుకున్నాడు "ప్రాన్స్ కనీ వినీ ఎరుగనంత భయంకరమైన ముఠా తయారు చేద్దాము. ఇక్కడ నుండి బైటపడే మార్గం ఆలోచించండి" అని వాళ్ళకు నూరిపోశాడు.

జైలు నుంచి పిచ్చాసుపత్రికి మకాం మార్చిన కొన్ని నెలలు బానే జరిగాయి ఒకనాడు— రోజర్ డేకర్ అనే అతను, హెన్రీ రుజాక్ అనే నాజీ నేరస్థుడు, ఎమైల్ కలిసి, రోజూ వ్యాయామం చేసే చోటున ఉన్న గోడగెంతి పారి పోయారు

(సశేషం)

దేశ రక్షణకై ఆయుధాలు
ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!



# కన్నెలకలలు

19 వ పేజీ తరువాయి

తను సుఖాన్నే అనుభవించింది. తనని ప్రేమించే అమ్మా, నాన్న, తమ్ముడు, చెల్లెలు ఉన్నారు. తమ అవసరాలకీ సరిపడ్డ డబ్బుంది తనకి దేవుడు అందమూ, చదువూ కూడా యిచ్చాడు. తను ఎం ఎస్ సి చదువుతుంది అప్పుడు తన కలలలోని రాజకుమారుడు కనిపిస్తాడు ప్రేమ.. ఫలితం పెళ్లి. ఈ ఆలోచనతో కావేరి సిగ్గు పడింది. కళ్ళు మూసుకుని నిద్రకి ఉపక్రమించింది.

* * *

కావేరి, పద్మ, లక్ష్మి, శశి నలుగురు బి. యస్సీ పరీక్షకి వెళ్లారు నలుగురూ మంచి స్నేహితులు నాలుగు సంవత్సరాల కాలేజీ జీవితం ఒకే మాటగా ఆనందంగా నాలుగు క్షణాలలాగ గడిపేశారు ఇప్పుడు విడిపోయారు అందరూ తలో వూరూ కావడంవలన పవిత్రమైన కన్నె మనసుతో ఏవేవో కోరుకొన్నారు కలలుకన్న వ్యక్తితో భావి జీవితం పరచిన పూల పానుపులాగా ఉంటుందని ఆశించారు. అవి ఎంతవరకూ తీరుతాయో!

* * *

సెలవు లయ్యాయి పరీక్షా ఫలితాలు వచ్చాయి. కావేరి, పద్మలకి ఫస్టు క్లాసు వచ్చింది లక్ష్మి, శశి పాసయ్యారు. సెలవలలో కావేరి తల్లి చనిపోయింది. జీవితంలో తనకి అన్నీ ఉన్నాయి అనుకున్న కావేరి జీవితంలో తీరని లోటే జరిగింది అందుకని కావేరి చదువుకు స్వస్తి చెప్పవలసి వచ్చింది పద్మ అనుకున్నట్లే ఎమ్ ఎస్ సి లో జాయినయింది తన కాబోయే భార్యకి అంతకంటే చదువు అనవసరమని గ్రహించిన మధు శశిని చదువు మానేయమన్నాడు లక్ష్మి తన మామయ్య పట్టుదల వలన బి ఇడి కి వెళ్లింది.

* * *

సాయంసమయం అప్పుడే పని ముగించుకుని కావేరి డాబామీదకి వచ్చింది అస్తమిస్తున్న సూర్యుడి కాంతిలో కొబ్బరాకులు తమాషాగా మెరుస్తున్నాయి కావేరి మనసు పలువిధాలైన ఆలోచనలతో నిండిపోయింది అమ్మ బ్రతికుంటే తను తప్పకుండా ఎమ్ ఎస్ సి చదువుతూండేది ఎక్కువ చదువుకోక పోయినా అమ్మకి చదువంటే చాలా యిష్టం. భర్తా, పిల్లలూ లేని మేనత్త వచ్చి తమ దగ్గరే ఉంటుంది తన తమ్ముడూ, చెల్లెలూ యింకా చిన్నవాళ్ళు వాళ్ల జీవితాలు ఎలా ఉంటాయో! "అసలే బాధలో ఉన్నావు చదువులో ప్రవేశిస్తే బాధని కొంతవరకూ మరచిపోవడానికి అవకాశం ఉంటుంది" అంటూ వ్రాసింది పద్మ కాని, తను యిలాంటి స్థితిలో తండ్రినీ, చెల్లెలునీ, తమ్ముడిని వదిలి ఎలా వెడుతుంది! క్రిందటి సంవత్సరం ఇదే రోజులలో తామందరూ తమ కోరికలని బయ పెట్టుకున్నారు ఇప్పుడు వాళ్లంతా ఏం చేస్తుంటారో! నాన్నగారు తనకీ పెళ్లి చేసెయ్యాలనుకుంటున్నారు. వారం రోజుల క్రిందట తనను చూసుకుందుకు వచ్చిన రఘు లెక్చరరుట తను తల ఎత్తి అతనిని చూడలేకపోయింది. చివరని వెళ్లిపోతుంటే చూసింది అందగాడే! సరిగ్గా అతనూ అప్పుడే వెనక్కి తిరిగి చూశాడు. తను సిగ్గుతో మొగ్గే అయింది. కావేరి పెదవులు మెల్లిగా విచ్చుకున్నాయి ఈ ఆలోచనలతో!

"అక్కా, నాన్నగారు పిలుస్తున్నారు" అంటూ రవి పిలిచేసరికి, ఆలోచనలలోంచి యీ లోకంలోకి వచ్చిపడింది క్రిందకి దిగి వచ్చింది కావేరి నాన్నగారు ఆరుబయట కూర్చుని ఏదో ఆలోచిస్తున్నారు. ప్రక్కనే టేబుల్ దగ్గర ఆరోజు పేపర్, ఒక కవరూ ఉన్నాయి. "పిలిచారుట, ఎందుకు నాన్నగారూ?" అంటూ వచ్చింది కావేరి. "అలా కూర్చో అమ్మా మొన్నను నిను చూసుకుందుకు వచ్చారు చూడు, వాళ్ల దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. అతనికి నువ్వు నచ్చావు నీ అభిప్రాయం చెబితే, నేను వెళ్లి మిగిలిన విషయాలు మాట్లాడుకుని నిశ్చయం చేసుకుని వస్తాను" అన్నారు కావేరి మాట్లాడలేదు. సిగ్గుపడకమ్మా నీకు ఇష్టంలేనిది చెయ్యను నీ అభిప్రాయం చెప్పు మీ అమ్మే బ్రతికివుంటే ఆమే అడిగేది. కాని ఆమె లేదు నాకు చెప్పకపోతే ఎలాగ?" అంటూంటే ఆయన కళ్లు చెమర్చాయి కావేరికి తల్లిమాట వచ్చేసరికి చెప్పలేనంత దఃఖం వచ్చింది. "మరి నేను మిమ్మల్ని విడిచిపెడితే ఎలాగ? చెల్లెలూ, రవి ఎలా ఉంటారు"? అంది.

"ఇవాళో, రేపో నువ్వు ఇంకొక చోటికి వెళ్లవలసినదే అదెలాగూ తప్పదు. రవి, ఉష, నేను, అత్త ఉంటాము మీ ముగ్గురినీ చదివించి మంచిగా జీవితంలో స్థిరపడేటట్లు చేయవలసిన బాధ్యత తండ్రిగా నాకుంది నువ్వు మాకోసమని ఎల్లకాలం యిక్కడ ఉండిపోయినా మాకు సంతోషంగా ఉండదు అందుకని చెప్పు, అతను నీకు నచ్చాడా?" ఇష్టమే నన్నట్లుగా తల వూపింది కావేరి.

తను కోరుకున్నట్లు అందమైనవాడు, చదువుకున్నవాడు దొరికాడు ఇక అతని హృదయమెలాగుంటుందో! అతడు మంచివాడు కాదు అనుకుందుకు కావేరి మనసు అంగీకరించలేదు ఆరాత్రే కావేరి తన స్నేహితురాళ్లు అందరికీ యీ విషయం తెలుపుతూ ఉత్తరాలు వ్రాసింది చివరికి "మునుపు మనం ఒప్పందాలు చేసుకున్నట్లు నా పెళ్లికి మీరందరూ రావాలనే మీకు ముందుగా తెలియపరుస్తున్నాను" అని వ్రాసింది

కావేరి పెళ్లి అతి వైభవంగా జరిగింది పద్మ, శశి, లక్ష్మి అందరూ వచ్చారు ఈవిధాన అందరూ కలుసుకుని ఒకరి మంచి చెడ్డలు ఒకరికి చెప్పుకున్నారు

* * *

"కావేరీ!" అని అరిచాడు రఘు రూములోంచి.

"ఎస్తున్నా!" సమాధాన మిచ్చింది కావేరి వంటయింట్లోంచి

"కావేరీ!" ఈసారి యిల్లంతా మారు మ్రోగింది అరుపుతో

చేతులు తుడుచుకుంటూ వచ్చి, "ఎందుకు అంత గట్టిగా అరుస్తారు?" అంది నవ్వుతూ

"ఇంకా అరుస్తారు అంటూ అడుగుతున్నావు! అసలు నీకు వినబడుతోందా నేను పిలిచింది! చేతిలో ఓ పుస్తకము పెట్టుకు కూర్చుంటే మొగుడనేవాడు ఒకడున్నాడని కూడ గుర్తుండదు నా పెన్నేది! కనబడడంలేదు. ఇందాకటి నుంచి వెతుక్కు చస్తున్నాను. కట్టుకున్న పెళ్లానివి గదా. వచ్చి వెతకక్కరలేదూ!" కావేరి కళ్ళు నీళ్లతో నిండిపోయాయి. మారు మాట్లాడకుండా వెతకడం ప్రారంభించింది. రఘు క్రిందటిరోజు వేసుకున్న షర్టుకే ఉంది పెన్ను! పెన్ను తీసుకుని వెళ్లిపోయాడు భారంగా నిట్టూర్చి వంటింటి వేపు కదిలింది కావేరి

* * *

"ఇదేవిటీ? కూరే! నేనేం రాక్షసుడి ననుకున్నావా? ఇంత కారం పోశావు! ఇది చారా, ఉప్పు కషాయమా? ఏమైనా అంటే గంగాభవాని రెడీగా ఉంటుంది. ఛీ ఇది కొంప కాదు. నరకం" అంటూ పళ్లెం తోసేసి విసురుగా లేచిపోయాడు మాస్టర్ ఆఫ్ సైన్స్ రఘు! బెదురుతున్న పెద్ద కళ్లు నీళ్లతో నిండగా, అలాగే నిలుచుండిపోయింది కావేరి. అంత కోపమేమిటి మనిషికి! తనకు మునుపు వంట చేయటం రాదు. ఇప్పుడు నేర్చుకుంది. అక్కడికీ ఎంతో జాగ్రత్తగా, భయపడుతూ చేస్తోంది. ఎప్పుడయినా చిన్న పొరపాటు జరిగితే క్షమించలేడు. చేసిన పొరపాట్లు క్షమించడమూ! పెళ్లయిన కొత్తే భార్యని సుఖపెట్టి తను సుఖపడవలసిన కాలం. ఎప్పుడూ ధాము ధూములే! ఏమీ సరదాలే లేవు ఎంతసేపూ తను పిక్చరుకి తిరగడమే కాని, భార్య కూడ మనిషే ఆమెకు సరదాలు ఉంటాయి అన్న ఆలోచనే లేదు. అతను సరదాగా ఉన్నప్పుడు, తను కూడ నవ్వుతూ ఏమైనా అంటే యిట్టే సీరియస్ అయిపోతాడు. కోపం ఎప్పుడూ ముక్కుమీదే ఉంటుంది. ఎలాగో ఈయనతో మంచి అనిపించుకోవడం! బ్రతికున్నంత కాలమూ అనుభవించడమే. మంచి భర్త దొరకడమనేది ఎంత అదృష్టవంతులకి! కావేరికి అన్నం తిన బుద్ధికాలేదు. వచ్చి పక్కమీద పడుకుని దిండులో ముఖం దాచుకుంది. దిండు ఆమె కన్నీటితో తడిసింది

వెనుకటి కెవరో ఒకాయన రూపవతిని వివాహమాడి, భార్యా రూపవతీ, శత్రు అని ఒక కన్ను పొడిచేశాడుట ఏకాక్షి, లోకసంచారీ అని రెండవ కన్ను కూడ పొడిచేసి గుడ్డిదాన్ని చేసి కూర్చోపెట్టాడుట అలాగే ఉంది మన యువకుల భావాలు నలుగురిలో గొప్పగా "నా భార్య బి ఏ" అని చెప్పుకుందుకు చదువుకున్న భార్య కావాలి. ఇంట్లో ఆమె చదువుని వీలైనన్ని సూటి, పోటీ మాటలతో గాయపరుస్తారు! చదువుకున్న భార్య కావాలనడం ఎందుకూ, మాటిమాటికి ఆమెని కించపరచడ మెందుకు!

* * *

"ఈరోజయినా మధు దగ్గరినుంచి ఉత్తరం

వచ్చేవారం ప్రారంభం!

నా డైరీలో ఒక పేజీ

రచన:

ముప్పాళ రంగనాయకమ్మ.

రావాలి. వెలరోజు లయింది ఉత్తరం వచ్చి. ఎప్పుడు ఇంత ఆలస్యం చెయ్యలేదే. అనుక్షణం నిన్నే తలుస్తూ ఉంటాను అంటూ వ్రాసే మధు లనని మరిచి పోయాడా ? ఉహు అదెప్పటికీ జరుగదు తీరికలేక వ్రాసిఉండడు ఒకవేళ ఒంట్లో బాగలేదేమో ! భగవాన్ ! నా మధుకేం లేకుండా ఆరోగ్యంగా, ఆనందంగా ఉంచు'' అంటూ శశి ఎదురుగా ఉన్న

## కన్నెల కలలు

ఏడుకొండలవాని పటానికి మొక్కింది "పోస్టు !'' అన్న కేకతో అతృతగా పరిగెత్తింది ఒక కవరు లందించాడు పోస్టుమాన్ అది మధు దగ్గర్నించి కాదు ! పద్మ దగ్గర్నుంచి తను బాగ చదువుతోం దిట, కావేరి దగ్గర్నుంచి ఉత్తరాలు లేవుట, అంత



కన్న విషయాలు ఏం లేవు. కావేరి భర్త దానిని ప్రేమగా చూడడంలేదుట. తన విషయం అలాగ కాదు మధు తనని ప్రాణం కంటె ఎక్కువగా ప్రేమిస్తాడు ఇంక నెం రోజులలో స్వదేశానికి తిరిగి వస్తాడు తనను చేపడతాడు తన జీవితం సుఖ మయం వవుతుంది. తనకంటె అదృష్టవంతురా లుండదు'' ఇట్లా తలపోస్తూ శశి ఎదురుగా టేబిల్ మీదున్న మధు ఫోటో కేసి చూసింది. విశాలమైన నుదురూ, చిన్నవైనా సూటిగా చూస్తున్న కళ్ళూ, కొంటెగా నవ్వుతున్న పెదవులూ మధు తనని చూసే నవ్వుతున్నట్లనిపించింది శశికి. చేతులలో దాచేసుకుంది ముఖాన్ని.

*   *   *

"సీతా ఇది విన్నావా ? మన మధు అక్క డెవరో అమ్మాయిని రిజిస్టర్ మారేజి చేసుకున్నా డుట'' అని తండ్రి గాభరాగ తల్లితో అనడం, పక్క గదిలోనే మంచంమీద పడుకుని పుస్తకం చదువుకుంటున్న శశి వింది. ఒక్కసారి గుండె ఆగిపోయినట్లయింది.

"అవేం మాటలండీ ? ఇలాంటి లేనిపోని వార్తలు ఎవరో మీకు అందిస్తూ ఉంటారు'' అంటూంది తల్లి.

"అబద్ధమయితే నే నెందుకు చెబుతాను ? నాకేమైనా శుభవార్తా యిది ? మన రామారావు గారి అబ్బాయి అక్కడే చదువుతున్నాడు అతను చదువు పూర్తయి తిరిగి వచ్చాడు అతనే చెప్పాడు తను వెళ్ళాడుట కూడ పెళ్ళికి ఫోటో కూడా తెచ్చి చూపించాడు ఇదుగో చూడు'' అంటూ శశి తండ్రి ఫోటో చూపించారు

"దుర్మార్గుడు అతడు చేసుకుంటా నన్నాడని ఎదిగిన పిల్లని ఇంట్లో కూచోబెట్టుకున్నాము. అందుకే నేను ముందే మొత్తుకున్నాను దేశంకాని దేశం పోతున్నాడు, ఎవరిని తీసుక వస్తాడో పెళ్లి చేసి మరీ పంపండని నామాట విన్నారుకాదు'' అంది ఆవిడ కన్నీళ్ళు తుడుచుకుంటూ

"పిచ్చిదానా, పెళ్లిచేసి పంపిస్తే మాత్రం ఇలాంటి సుబుద్ధి వూరుకుంటాడా ? పెళ్లయ్యాక యిలా చేస్తే మరీ బాధ ఇదీ మంచికే అయింది. ముందే తెలిసింది అతగాడి బుద్ధి''

శశి యింక ఉండబట్టలేక పోయింది "ఏం జరిగింది నాన్నా ?'' అంటూ వచ్చింది గాభరాగ.

"ఏం జరగకూడదో అదే జరిగింది మన మధు సూధనుడు అక్కడ ఒక గోపికను పట్టాడుట'' అన్నారు ఆయన

"నేను నమ్మను నాన్నా మధు అలాంటివారు కాదు'' అంది శశి

"ఇంక నమ్మకేం చేస్తావు ? ఇదిగో ప్రత్యక్ష నిదర్శనం చూడు'' అంటూ ఫోటో యిచ్చారు

మధు నవ్వుతూ నుంచుని ఉన్నాడు అతడి పక్కనే ఒక ఆంగ్ల యువతి ! ఇద్దరూ చేతులు కలుపుకు నుంచున్నారు. శశికి ప్రపంచం అంతా తల్లక్రిందులైనట్లయింది గదిలోకి పోయి తలు పులు వేసుకుని ఏడుస్తూ కూర్చుంది మధు ఎంత మోసం చేశాడు ! తన కలలన్నీ కల్లలే అయిపో యాయి. తనంటే ఇష్టంలేనినాడు తనకి అంత ప్రేమగా ఎందుకు ఉత్తరాలు వ్రాయడం ! తనని వివాహం చేసుకునేందుకు ఎందుకు అంగీకరించడం మగబుద్ధి ! నమ్మించి గోతిలో తోశాడు. తన ఆశ లన్నీ అతనిమీదే పెట్టుకు జీవిస్తూంటే, అతడు

మలువుగా కాదనేశాడు కాని, తన మనస్సులోంచి అతని రూపాన్ని అంత త్వరగా తను తుడిచేసుకో గలదా! శశి మనస్సు అల్లకల్లోలమై పోయింది.

తరువాత ఇంకో సంబంధం చూసి త్వరలో శశికి పెళ్లి చెయ్యమని తొందరచేసింది తల్లి శశి అసలు యింక పెళ్ళే చేసుకోనని చెప్పింది "పెళ్లి లేకుండా ఇలాగే ఉండిపోతావా ? ఒక సంబంధం తప్పిపోతే ఇంక పెళ్ళే చేసుకోకుండా ఉంటారా యేం ?" అంది తల్లి కోపంగా.

"దాని మనస్సు బాగా గాయపడింది ఇప్పుడు మనమేం అనకు దానిని కొంతకాలం పోనీ స్థిమిత పడుతుంది" అన్నారు తండ్రి.

చోటు మారిస్తే కొంతవరకూ మరవగలదేమో నని శశిని ఆమె పిన్ని యింటికి పంపించారు సెలవ లవగానే శశి తను గ్రామసేవిక ట్రెయినింగ్‌కి వెడతానని గట్టిగా చెప్పింది తండ్రికి తండ్రి అభ్యంతరం చెప్పలేదు ట్రెయినింగ్ అయిన వెంటనే అరకు లోయలో గ్రామసేవికగా నియమించారు.

* * *

జీవితం నిస్సారంగా గడిచిపోతూంది. పల్లె ప్రజల మధ్య జీవితం కొత్తగా ఉంది శశికి రోజూ పొద్దున్నే బయలుదేరి దగ్గరి పల్లెలకి నడచివెళ్లి అక్కడి ప్రజలకి చదువు ఎంత అవసరమో, పొదుపుతనం ఎలా అలవరచుకోవాలో, ఆరోగ్యం గురించి తీసుకోవలసిన జాగ్రత్తలూ, కుటుంబ నియంత్రణం ఎంత మంచిదో అన్నీ చెప్పాలి అమాయకు లనుకున్న పల్లె ప్రజలలో చెప్పినది శ్రద్ధగా వినేవారుంటారు అర్థంకాక విస్మయంతో చూసేవారుంటారు. చెప్పినది వినడం మాని ఆమె వేషభాషలని పరీక్షగా చూసేవారుంటారు. ఒకసారి ఒక ఉత్కళ మహిళ "మీకు పెళ్లయిందా ?" అని అడిగింది శశి బిత్తరపోయి, తేరుకుని "లేదు" అని చెప్పింది. "ఎందుకు పెళ్లి చేసుకోలేదు ? నీ ఆలనా, పాలనా చూసే పెద్దవాళ్లు లేరా ? ఇలా వూరూరూ పట్టుకు తిరగకపోతే పెళ్లి చేసుకోరాదూ? " అంది శశి సమాధానం చెప్పలేక వూరుకుంది

ఒకరోజు శశికి బరువైన కవరు వచ్చింది అది లక్ష్మి దగ్గర్నుంచి. ఆత్రంగా కవరు చించి లోపలి కాగితాలు తీసి చదువ నారంభించింది

"నా గురించి నువ్వు విని చాలకాల మయింది కదూ! ఆరునెల లయిందనుకుంటాను మనం విడిపోయిన కొత్తలో లాగ అంత తరుచుగా ఇప్పుడు ఉత్తరాలు వ్రాసుకోవడంలేదు వీలు పడదు కూడాను అప్పుడయితే బరువు, బాధ్యతలు లేక హాయిగా విహరించే పిట్టల లాంటి జీవితాలు మనవి ఇక ఇప్పుడా, ఎవరి బాధలు వాళ్లకున్నాయి నా జీవితం గురించి తెలుసుకోవాలని నీకు కుతూహలంగా ఉంటుంది కదూ. అందుకే నా గురించి అంతా వ్రాస్తున్నాను మీ దగ్గర నాకు దాపరికం లేదుగా!

అమ్మా, నాన్నా లేపోయినా నన్ను పెంచి, చదువు చెప్పించిన మామయ్య భారం త్వరలోనే తీర్చాలని నేను బి యిడి కి వెళ్లాను ట్రెయినింగ్ అవుతూనే మా వూర్లోనే ఉద్యోగం అయింది వచ్చిన జీతమంతా మామయ్యకే ఇచ్చేస్తున్నాను మామయ్యకి బరువుగా లేను అనే తృప్తి ఉండేది నాకు. ఒకరోజున మామయ్య నన్ను పిలిచి "చదువుకున్నావు. ఉద్యోగం చేస్తున్నావు. బాగానే ఉంది. ఇంక గృహస్థాశ్రమం స్వీకరించాలి కదా. ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సులో జరగాలి నీ మనసులో ఎవరైనా ఉంటే చెప్పు. లేకపోతే నేను ప్రయత్నాలు చేస్తాను" అన్నారు మనసులో ఎవరైనా ఉంటే చెప్పాలిట! మామయ్య సహృదయానికి మనస్సులోనే జోహారు లర్పించాను. ఎంతమంది తల్లితండ్రులు తమ పిల్లలని అడుగుతారు యీ ప్రశ్న ? చిన్నప్పుడే అమ్మా, నాన్నా చనిపోయినా, నాకు ఏ లోటూ రాకుండా సొంత బిడ్డలా చూసుకున్నారు అత్తా, మామయ్యా. వాళ్ల ఋణం అసలు తీర్చుకోలేను. లోటు తెలియకుండా నన్ను పెంచి, చదువు చెప్పించి ఇంతదాన్ని చేశారు. "పెళ్లియత్నాలు చేయండి కాని మన తాహతుకు మించి ప్రయత్నించవద్దు" అని చెప్పాను.

"కొన్ని రోజుల తరువాత ఒకరోజు—ఆదివారం కనుక స్కూలు లేదు ఆరోజు నాకు బాగా గుర్తుంది మా యింటి ముందు తోటలో కూర్చుని ఉన్నాను నాకు మొక్కలంటే చాల యిష్టమని నీకు తెలుసుకదా! మా యింటిముందు చక్కటి తోట పెంచుకున్నాను. తోటే నా అభిమాన స్థలం. అక్కడ కూర్చుంటే నాకు ఎంతో మనశ్శాంతిగా ఉంటుంది. ఆరోజు కూడ అక్కడే కూర్చుని జాజులు గుచ్చుకుంటున్నాను. అక్కడికి మామయ్య, ఒక యువకుడు వచ్చారు. మామయ్య "ఇతను మిస్టర్ మూర్తి, మా ఆఫీసులో క్రొత్తగా చేరాడు అధునాతన భావాలు కలవాడు కొంచెం కవిత్వం పిచ్చి ఉంది" అని "ఈమె మిస్ లక్ష్మి టీచర్‌గా పని చేస్తూంది. నా మేనకోడలూ, కూతురూ కూడ" అంటూ పరిచయం చేశారు ఆయన ఉన్నంతసేపూ నవ్విస్తూ, నవ్వుతూ సరదాగా మాట్లాడారు ఎదుటివారికి విసుగు కలగకుండా ఇంకా వినాలనిపించేట్లు మాట్లాడారు నేను ఎక్కువ మాట్లాడననీ, ఎక్కువ నవ్వననీ మీరు అంటుండేవారుకదా ఆరోజు నేను ఎంత హాయిగా, ఎక్కువగా నవ్వానను కున్నావు ? ఆయన వెళ్లిపోయిన తరువాత మామయ్య చెప్పారు. నా అర్హతలు విని నన్ను వివాహం చేసుకుందుకు అంగీకరించి నన్ను చూడటానికి వచ్చారుట మూర్తి! మామయ్య సంస్కారానికి నేను ఆశ్చర్యపోయాను మనకంటె ఒక తరం వెనుకవారయిన మామయ్యలో ఇంత ఉన్నత భావాలుండడం ఆశ్చర్యమేగా! పెళ్లిచూపులనే తతంగంతో యువతీ యువకుల అభిప్రాయాలు స్వేచ్ఛ ఒకరి కొకరు తెలుపుకుందుకు అవకాశం లేకుండా, అమ్మాయిని యిబ్బందిలో పెట్టి సిగ్గుతో తలెత్తకుండా చేసే ఆర్భాటం లేకుండా ఎంత సరళంగా జరిపించారు!

"ఏమ్మా, అతను నీకు నచ్చాడా ?" అని అడిగారు మామయ్య

"మరి ఆయన . " నేను యింకా ఏదో అనబోతుంటే మధ్యలోనే మామయ్య "నీకా భయం అక్కరలేదు లతనికీ నువ్వు నచ్చావు. కట్నమూ, కానుకలు అక్కరలేదు. అతనికి వెనుక ఆస్తి లేదూ అప్త బంధువులూ లేరు. ఏం? నీ కిష్టమేనా ?" అన్నారు నేను అంగీకారం తెలిపాను. ఇంత సంస్కార హృదయులు నాకు లభించడం నా అదృష్టం కాదూ ?"

"మా పెళ్లికి నువ్వు కావేరి రాలేదు. పద్మ మాత్రం వచ్చింది. అది కూడ ఛాటర్ బాక్స్ కనుక బావగారిని మెచ్చుకుంది మనం కావేరి ఇంట్లో కూర్చుని భావి జీవితం గురించి కలలు కన్నాం గుర్తుందా ? అప్పుడు నేను రూపము, ధనము, చదువుతో నాకు పనిలేదనీ, నన్ను ప్రేమించేవాడు కావాలని చెప్పాను భగవంతుడు నా కోరికను తీర్చా డనుకున్నాను నేను మామూలుగానే ఉద్యోగం చేస్తున్నాను. నేను మానేస్తా నన్నా, ఆయన వారించారు ఇప్పుడు నేను మామయ్య యింట్లో కాదు ఉంటున్నది నా యింట్లో! ఆయన ముఖంలో ఎప్పుడూ చిరునవ్వు చిందులాడుతూ ఉంటుంది. కోపమే లేదు. ప్రతి పనిలోనూ నాకు సాయంచేస్తా నంటారు. వద్దని ఎంత చెప్పినా వినిపించుకోరు చంటి పిల్లా






...గా మారాం చేస్తారు. ఆయన చక్కగా పాడ
రు కూడాను. ఆయనతో వివాహ మయ్యాక
...తమంటే ఏమిటో తెలిసింది ఆనందపు
...తులు చూపిస్తున్నారు "ఆయన" గురించి
...టే చెబుతూంది అని వినుకుంటున్నావా ?
మంచి కోరేవాళ్లల్లో నువ్వొకదానివి కనుక
...తున్నాను"

# కన్నెల కలలు

"ఇన్ని మంచి గుణాలున్న ఆయనలో ఒక లోటు ఉంది ఆయన త్రాగటం అలవాటు చేసుకున్నారు చెప్పుకుందుకు సిగ్గుగా ఉంది మామయ్యకు కూడా తెలియదు ఈ సంగతి రాత్రి త్రాగి తూలుతూ వస్తారు. మర్నాడు యిలా చేయవద్దని బతిమాలితే ఎంతో బాధపడతారు నన్ను కష్టపెడుతున్నానని. ఇంక తాగనని ప్రమాణం చేస్తారు. ఒక వారం రోజుల వరకూ బాగానే ఉంటారు. మళ్లా కథ మామూలే ఏం చేయను ? అన్ని మంచి గుణాలున్న ఆయన దీనికి ఎందుకు లొంగిపోవాలి ? ఇది నా దురదృష్టం కాదూ ! కాని ఆయన ఎప్పటికయినా మారతారు ఈ దురలవాటు మానేస్తారు అన్న ధైర్యంతో రోజులు గడుపుతున్నాను భగవంతుడే నామీద దయ చూపాలి

ఇప్పుడు అయిదయింది ఇంకా తెల్లవార లేదు అన్నీ వ్రాయాలి కదా అని త్వరగా లేచి వ్రాస్తున్నాను ఇంక ఇంటి ... లోకి వెళ్లాలి. ఇంకొంచెంసేపటికి శ్రీవారు లేచి కాఫీ అంటూ రాగాలాపన ప్రారంభిస్తారు ఇంక ముగిస్తా. నువ్వు ఎలా ఉన్నావు ? నీ కబుర్లు వ్రాయి. నువ్వుంటున్న అరకులోయ చాలా అందంగా ఉంటుందట కదూ. ఈ వేసంగికి అక్కడికి మకాం వేద్దాం అంటున్నారు శ్రీవారు పద్మ పరీక్షలు అయిపోయి ఉంటాయి ఈపాటికి కావేరి జీవితం మామూలే! దాని ఓపిక మెచ్చుకోవాలి అసలు మన జీవితాలే అంతేలే. ఎన్నో ఆశలు పెట్టుకుంటాం. చివరికి అన్నీ వదులుకుని లభించినదానితో తృప్తిచెంద డానికి ప్రయత్నిస్తాం.

నీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూంటాను.

నీ,

లక్ష్మి"

కాగితాలు మడిచేసింది శశి తనకంటే లక్ష్మి అదృష్టవంతురాలు. ఎలాంటివాడైనా భర్తని వలచి, వలపించుకుంటోంది అతను ఆ ఒక్క దుర్గుణం కూడ వదలివేస్తే అది ఇంకా సుఖ పడుతుంది, అనుకుంది

*　　*　　*

డోర్ కర్టెను పక్కకి తొలగించి, లోపలికి వెళ్లి "ఇందిరా !" అని పిలుస్తూ, ఒక కుర్చీలో కూలబడింది పద్మ "వస్తున్నా !" అంటూ ఇందిర పరిగెత్తుకు వచ్చింది వచ్చారా ? మీరు చెప్పినదానికంటె అరగంట లేటు మొత్తానికి ఇండియన్ అనిపించుకున్నారు నేను యిప్పుడే వచ్చేస్తాను" అంటూ గబగబా మాట్లాడి మళ్లీ లోపలికి తుర్రుమంది ఇందిర టేబుల్‌మీద ఉన్న పత్రిక తీసుకుని, పేజీలు తిరగవేయ సాగింది. పద్మ. అడుగుల చప్పుడు విని పక్కకి తిరిగి చూసింది. ఒక యువకుడు హడావుడిగా లోపలికి వస్తున్నాడు.. తెల్లగా ఉన్నాడు. పొడుగ్గా ఉన్నాడు నుదుటిమీద ఉంగరాల జుట్టు అందంగా పడుతూంది పద్మని చూసి లోపలికి పోబోయాడు. "వెళ్లిపోవద్దు ఉండన్నయ్యా పరిచయం చేస్తాను" అంటూ ఇందిర ట్రేలో కాఫీ, టిఫిను పట్టుకుని వచ్చింది "ఈమె మిస్ పద్మ ఎమ్. ఎస్ సి. మా లెక్చరరు ఈయన మా అన్నయ్య శ్రీధర్. అసిస్టెంటు ఇంజనీర్. ప్రస్తుతం సెలవులో ఉన్నాడు" అంటూ యిద్దరినీ పరిచయం చేసింది ఇందిర

అందరూ కాఫీ, టిఫినుకి ఉపక్రమించారు

"ఇక్కడ అసలు పొద్దుపొయ్యేదే కాదు నా అభిప్రాయాలకి తగిన స్నేహితులే లేరు మా కాలేజీలో. ఇందిర పరిచయ మయ్యాక కాస్త కాలక్షేపం అవుతూంది. అసలే నేను ఎక్కువ మాట్లాడే

దానిని. అలాంటి నన్ను మాట్లాడకుండా ఉండమనడం కంటె వేరే శిక్షేం లేదు. చిన్నప్పుడు మా అన్నయ్య అనేవాడు, అయిదు నిముషాలు మాట్లాడకుండా వుండి చూద్దామని ఊహూ. మన తరం అయ్యేది కాదు" అంది పద్మ నవ్వుతూ

"అయితే ఫరవాలేదు మా యింట్లో అందరూ అదే వైపు" అన్నాడు శ్రీధర్ పద్మ వైపు చూస్తూ.

తర్వాత చాలసేపు కబుర్లు చెప్పుకున్నారు కబుర్లలో పడి కాలాన్ని మరచిపోయారు. చీకటి పడింది "చాలసేపయింది ఇంక నేను వెడతాను" అంటూ పద్మ లేచింది "మీ ఇల్లు దగ్గరేనా ?" అన్నాడు శ్రీధర్

"మరీ దగ్గర కాదు దూరమనే చెప్పాలి" అంది పద్మ

"పదండి. మిమ్మల్ని ఇంటివరకూ సాగనంపుతాను" అంటూ లేచాడు శ్రీధర్

"నేను వెళ్లగలను భయంలేదు" అంది పద్మ

"కారులో డ్రాప్ చేస్తాను రండి మిమ్మల్ని ఇంటిదగ్గర దిగపెట్టకపోతే ఇందు రాత్రికి నన్ను నిద్రపోనివ్వదు" అంటూ లేచి వెళ్లాడు ఇంక పద్మ ఊరుకుంది

కారు ఇవతలికి తీసి, ముందు తలుపు తెరిచాడు పద్మ వచ్చి కూర్చుంది కారు మెల్లగా పోతూంది పద్మ బయటికి చూస్తూ కూర్చుంది "ఏమిటి, ఒక్కసారిగా సైలెంట్ అయిపోయారు? ఏమిటాలోచిస్తున్నారు ?" అన్నాడు శ్రీధర్

"అబ్బే ఏంలేదు" అంది పద్మ

"మీ సబ్జక్ట్ బోటనీ కదా మా ఇందూ అంతే నేను చాలమందిని చూస్తున్నాను లేడీస్ ఎందుకో బోటనీ జూఆలజీ ఈ సబ్జెక్ట్సు ఎక్కువ యిష్టపడతారు"

"సరే మా చదువంటే అసలే పక్షపాతం" అన్నాడు శ్రీధర్ నవ్వుతూ

"ఇప్పుడదేం లేదులెండి మీ చదువులో కూడా ఇప్పుడు లేడీస్ ఉన్నారుగా" అంది ఇంతలో పద్మ ఇల్లు వచ్చింది

"రండి లోపలికి అమ్మని, తమ్ముడిని పరిచయం చేస్తాను"

"ఎందుకులెండి ? ఇంకొకసారి వస్తాను"

"ఇప్పుడు రండి కొంచెంసేపు కూర్చుని వెడుదురుగాని"

లోపలికి రాక తప్పలేదు శ్రీధర్‌కి లోపల హాల్లో పద్మ తల్లి ఏదో కుట్టుకుంటుంది తమ్ముడు రేడియో సిలోన్‌లో నిమగ్నుడయ్యాడు

"అమ్మా, ఈయన ఇందిర అన్నయ్య శ్రీధర్ అసిస్టెంట్ ఇంజనీర్" "ఈవిడ మా అమ్మ" అంటూ పరిచయం చేసింది

కొంచెంసేపు కూర్చుని వెళ్లిపోయాడు శ్రీధర్

సెలవలు కనుక పద్మ, ఇందిరలకి కాలేజీలేదు శ్రీధర్ సెలవులో ఉన్నాడు అందువలన తరుచుగా కలుసుకునేవారు సినిమాలు, షికార్లు, చర్చలతో కాలం గడిపేవారు వాళ్ల సంభాషణలో కృశ్చేవ్ దగ్గర నుంచి దేవానంద్ వరకూ, అన్ని విషయాలూ దొర్లేవి ఎక్కువగా పద్మ, శ్రీధర్ వాదించుకునేవారు. ఇందిర ఇద్దరి వాదనలూ వింటూండేది అప్పుడప్పుడు తన అభిప్రాయాలు కూడ చెప్పేది. **శ్రీధర్‌కి ప్రతి విషయంమీద స్థిరమైన అభి**

## కన్నెల కలలు

ప్రాయా లుండేవి పద్మ ముందు ఎంత వాదించినా చివరకు శ్రీధర్ అభిప్రాయం వైపే మొగ్గ వలసి వచ్చేది అతడి అభిప్రాయాలు విస్ఫారిత నేత్రాలతో వింటుండేది పద్మ అతడి విజ్ఞానాన్ని మనస్సులోనే మెచ్చుకునేది శ్రీధర్ ఎక్కడా వెకిలిగా ప్రవర్తించేవాడు కాడు. అమ్మాయి కనిపిస్తే అష్టవంకరలూ తిరిగే మగవారినే ఎక్కువగా చూసిన పద్మ శ్రీధర్‌ని చూసి మెచ్చుకుంది. మర్యాదస్తు డనుకుంది.

ఒకరోజున బీచ్ ప్రోగ్రాం వేసుకున్నారు పద్మ ముందుగా వచ్చింది ఇంకా ఇందిర, శ్రీధర్ రాలేదు. అందంగా అలంకరించుకుని తిరుగుతున్న జంటలనీ, ఇసుకలో పిచ్చుకగూళ్ళు కట్టుకుని ఆనందిస్తున్న పిల్లలని చూస్తూ కూర్చుంది పద్మ. అలా కూర్చున్న పద్మ ఆలోచనలు స్నేహితురాళ్ళమీదకి వెళ్ళాయి. అతి సున్నితమైన మనస్సు కావేరిది. దానికి రాతి గుండెవాడు దొరికాడు. జీవితం గురించి చాల వూహించింది. అందుకే ఆశలన్నీ పేకమేడలా కూలిపోయాయి. శశి మొదటినుంచీ మధు మీద ఆశలు పెట్టుకుంది. తాము కలసి చదువుకున్న రోజుల్లో దానిని ఎంత ఏడిపించేవారని ! అతను దానిని మోసంచేసి ఎవరినో చేసుకున్నాడు. లక్ష్మి ముందునుంచీ ఎక్కువగా వూహించుకుంటూ కూర్చోలేదు. తనకు దేవుడిచ్చిన జీవితాన్ని నిర్భయంగా ఈదుతూంది. అదే నయం వాళ్ళిద్దరికంటె. వాళ్ళందరి జీవితాలు చూశాక తనకి అసలు పెళ్ళి చేసుకోకూడ దనిపిస్తూంది. తన జీవనోపాధికి లోటు లేకుండా సంపాదించుకుంటోంది. ఈ జీవితం బాగానే ఉందనిపిస్తోంది. కాని అమ్మ ఒత్తిడి ఎక్కువగా ఉంది ఈమధ్య. తన ఆరోగ్యం బాగలేదు కనుక, తండ్రి అసలు లేరు కనుక పద్మ పెళ్ళి అయితేనే తనకి మనశ్శాంతి అంటూ గొడవ పెడుతూంది. తను ఎంత హాయిగా ఉన్నా జీవితంలో భాగస్వామి లేకపోవటం లోటేనట ! ఆలోచనలతో సతమతమవుతున్న పద్మకి వస్తున్న శ్రీధర్ కనిపించాడు. వచ్చి పద్మకి కొంచెం దూరంలో కూర్చున్నాడు.

"ఇందిర రాలేదేం ?" అనడిగింది పద్మ.

"తల నొప్పిగా ఉందని రాలేదు."

ఎప్పుడూ నవ్వుతూవుండే శ్రీధర్ గంభీరంగా ఉండడం గమనించి "అలా ఉన్నారేం" అడిగింది పద్మ.

"ఎలా ఉన్నాను?" అని నవ్వి "సెలవు అయిపోతూంది. ఎల్లుండి వెళ్ళిపోవాలి. మీ పరిచయంతో యీ నెల రోజులు చాలా సరదాగా గడిచిపోయాయి. మరిచిపోలేను. యీ రోజులు" అన్నాడు పద్మ కళ్ళల్లోకి చూస్తూ.

"ఇంట్లోవాళ్ళని వదిలి వెళ్ళాలంటే బాధగా ఉందా ?" అంది.

"కాదు. వాళ్ళకంటే ఎక్కువగా హృదయంలో ముద్ర వేసుకు కూర్చున్న వ్యక్తిని వదిలి వెళ్ళాలంటే బాధగా ఉంది ?" అన్నాడు

"ఎవరా వ్యక్తి ?" అంది పద్మ ఆశ్చర్యంగా

"చూడండి ఇలాంటి విషయాలలో నిర్మొహమాటంగా ఉండాలి. మిమ్మల్ని మొదటిసారి చూసి

రప్పుడే మీలాంటి వ్యక్తి కోసమే నేను ఎదురు చూస్తున్నా ననిపించింది మీ పరిచయంతో నా కోరిక బలపడింది నెల రోజునుంచీ నన్ను చూశారు కదా నా గురించి అంతా తెలుసుకునుంటారు నన్ను పెళ్లిచేసుకోవడం మీ కిష్టమేనా ?" సూటిగా చూస్తూ అడిగాడు శ్రీధర్

బిత్తరపోయింది పద్మ ఈ ప్రశ్న తనూహించ వది. ఏం జవాబు చెప్పాలో తెలియదు ఆ యువ కుడిని ఆ దృష్టిలో తనెప్పుడూ చూడలేదు "క్షమించాలి పెళ్లంటే నాకు కొన్ని అభిప్రాయా లున్నాయి" అంది మెల్లిగా తల దించుకుని.

"ఏమిటవి, చెప్పండి నిర్మొహమాటంగా నేనేం అనుకోను"

"పెళ్లి అన్నది నిండు జీవితానికి సంబంధించిన సమస్య ముందు ఇది వినండి" అంటూ కావేరి, లక్ష్మి, సుశీల జీవితాల గురించి చెప్పింది "వాళ్ల ముగ్గురిలో ఎవరూ సుఖపడడంలేదు అందుకే నాకు పెళ్లంటే భయం నా జీవితం మాత్రం అంతకంటే ఆనందంగా గడుస్తుందని ఎలా అనుకోను ? నన్ను పెళ్లి చేసుకునేవాడు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించా లనుకోవడంలో అత్యాశ లేదనుకుంటాను" అంది.

"ఒకరి జీవితం దుఃఖమయం అయిందని మిగి లిన అందరూ సుఖాన్నాశించకుండా ఉండిపోతారా ? వివాహం జీవితంలో తప్పనిసరి కదా ? స్త్రీకి పురు షుడు, పురుషుడికి స్త్రీ తోడునీడ మిమ్మల్ని పూజాప్రసూనంలా కళ్ల కద్దుకుని ఆరాధిస్తాను నన్ను నమ్మండి" అన్నాడు శ్రీధర్.

"ఆలోచించుకుని చెబుతాను"

"బాగ ఆలోచించే చెప్పండి రేపు నాకు మీ నిర్ణయం తెలియచేయండి ఇందులో నిర్బంధ మేమీ లేదు. మీకు వరుడు కావలసిన అర్హతలు నాలో ఉంటేనే అంగీకరించండి" అన్నాడు.

పద్మ మాట్లాడకుండా కూర్చుంది

కొంచెం సేపయిన తరువాత "ఇక పోదామా" అన్నాడు లేస్తూ పద్మ కూడా లేచింది తను వెళ్లి కారు తలుపు తెరిచి, ఆమె ఎక్కిన తరువాత తనూ కూర్చుని కారు స్టార్ట్ చేశాడు మధ్యలో ఎవరూ మాట్లాడలేదు. పద్మ ఇల్లు వస్తూందనగా శ్రీధర్ అన్నాడు "ఫలితం ఎలాగున్నా మన స్నేహా నికి అడ్డు రానీయకండి కనీసం స్నేహితులుగా విడిపోదాం" అన్నాడు

"ఆ విషయం కోసమని స్నేహితులని వదులు కునేంత అనాగరికురాలిని కాదు"

"చాల థాంక్స్"

పద్మ ఇల్లు వచ్చింది దిగి "వస్తానండీ" అంది.

"గుడ్‌నైట్ !"

కారు కనుచూపుమేర దాటేంత వరకూ గేట్ దగ్గరే నిలబడి, లోపలికి వెళ్లింది పద్మ.

"పద్మా, ఇంకా ఎంతకాలం ఇలా ఉంటావు ? నామాట విని పెళ్లి చేసుకో నీకు పెళ్లిచేస్తే కాని నాకు శాంతి ఉండదు తర్వాత మేమయినా చింత ఉండదు" అని ప్రారంభించింది పద్మ తల్లి, పద్మ భోజనం కానిచ్చి హాలులోకి వచ్చి కూర్చో గానే

"సరేనమ్మా. చేసుకుంటాను. ఎవరిని చేసుకో మంటావు ?" అని నవ్వుతూ అడిగింది పద్మ

"ప్రతి విషయానీ అంత తేలికగా తీసేయకు. నేను తమాషాకి చెప్పడంలేదు. బాగా ఆలో చించుకో. ఆడది ఒంటరిగా బ్రతకగల్గిన పరి స్థితులు మన సంఘంలో లేవు అందుకని నీకు ఒక అండ కావాలి తప్పదు అది ఎప్పుడో చేస కునే దానికంటే ఇప్పుడే చేసుకుంటే నాకు తృప్తి మిగులుతుంది బాగ ఆలోచించుకో."

"సరేనమ్మా నువ్వు చెప్పినట్లే వింటాను వరా న్వేషణ కూడ నీదే బాధ్యత" సాధ్యమైనంత గంభీరంగా అంది పద్మ

"ఇందిర అన్న శ్రీధర్ లేడూ, అతనిని చేసుకో అతనికి నిన్ను చేసుకోవాలనుందిట సాయంత్రం అతని అమ్మ, నాన్నగారు వచ్చార ఈ విషయం మాట్లాడ దామని వాళ్లందరికీ కూడా ఇది ఇష్టమే బుద్ధిమంతుడు, మంచి ఉద్యోగస్థుడు నాకైతే ఇష్టమే యీ సంబంధం. మరి నీ అభి ప్రాయం చెప్పు".

అటు తల్లితండ్రులని పంపించి, అతను తన అభిప్రాయం తెలుసుకుందుకు వచ్చాడన్నమాట.

"నన్ను కొంచెం ఆలోచించుకోనీయమ్మా !"

"అలాగే. బాగా ఆలోచించ కుని చెప్పు"

ఒకానొక్క పాలసీదారుకి భీమాసంస్థనుంచి వచ్చిన ఉత్త రంలో ఇలావుంది :

"మీ సొమ్ము అంతా ఒకే మొత్తంగా మీమరణకాలంలో మీకు అంద జేయబడుతుంది. మీకుకూడా ఈ పద్ధతేనచ్చుతుం దనుకుంటున్నాము."

గిరిజాశంకర్ (బొంబాయి)

ఆ రాత్రి పద్మకి చాలసేపు వరకూ నిద్ర పట్టలేదు. అమ్మ అన్నట్లు ఇంక తను గృహస్థా శ్రమం స్వీకరించడం మంచిదేమో ! ప్రస్తుతం సాంఘిక పరిస్థితుల దృష్ట్యా చూస్తే స్త్రీ ఒక అండ లేకుండా బ్రతకడం కష్టం దూర ప్రాంతాల నుంచి వచ్చి ఒంటరిగా ఉంటూ తనతో పాటు పని చేస్తున్న మీనాక్షి ఎంత గొడవ పెట్టేదీ రాత్రుళ్లు తలుపులు తట్టేవారని, పొద్దున లేచి చూసేసరికి ఏ కిటికీలోనో 'ప్రేయసీ అంటూ ప్రారంభించి రాత్రి ఫలానా చోటుకి రాకపోతే చంపేస్తానంటూ బెదిరించే ఉత్తరాలు ఉండేవని చెప్పుకుని ఏడిచేది చివరికి గాభరా ఎత్తి ఉద్యోగం వదులుకుని వాళ్ల వూరు వెళ్లిపోయింది. అందుకని తనకి రక్షగా ఒకళ్లు ఉండాలి ఆ ఎవరో శ్రీధర్ ఎందుకు కాకూడదు ! అందగాడు, విద్యా వంతుడు, సంస్కారం కలిగినవాడు. అన్నిటికీ మించి తనను ప్రేమించినవాడు తర్వాత కూడ ఈ ప్రేమ నిలుపుకుంటాడా లేదా అన్నదే ప్రశ్న. కాని యీ ప్రశ్న ఎవరి విషయంలో అయినా కలిగేదే అది తన అదృష్టాన్ని బట్టి ఉంటుంది. "నన్ను నమ్మండి మిమ్మల్ని పూజాప్రసూనంలా చూసుకుంటాను" అన్న శ్రీధర్ మాటలు గుర్తుకు వచ్చాయి మిగిలినది తన అదృష్టం ఎలా ఉంటే అలాగ జరుగుతుంది రేపు అమ్మకి తన అంగీ కారం తెలియపరచాలి అనుకుంది. తను అంగీక రించినట్లు తెలిస్తే శ్రీధర్ ఏమనుకుంటాడో ! రెక్కలు కట్టుకుని తన ముందు వచ్చి వాలతా డేమో !

* * *

మర్నాడు పద్మ, తల్లికి తన అంగీకారం తెలియ జేసింది తల్లి మహదానందపడిపోతూ శ్రీధర్ తల్లి తండ్రులకి కబురంపింది ఆ సాయంత్రం జాజి పందిరి దగ్గర కూర్చుని చదువుకుంటున్న పద్మ కారు హారన్ విని తలెత్తి చూసింది. పరు గెత్తుతూ వస్తున్న ఇందిర, వెనకాల చిరునవ్వుతో శ్రీధర్ ! పద్మ తల దించేసుకుంది

"వదినా !" అరుచుకుంటూ వచ్చింది ఇందిర.

"అన్నయ్య బీచ్‌కి వెడదా మంటున్నాడు. త్వరగా తయారవు భయపడకు, నేనేం మీతో రానులే నన్ను మధ్యలో నా స్నేహితురాలి ఇంటిదగ్గర డ్రాప్‌చేస్తే చాలు. అయినా ఇదేం మర్యాదమ్మా, ఇంటికి వచ్చిన వాళ్లని, అందులో ముఖ్యంగా ఆడ బడుచుని కూర్చోమనన్నా అనరూ ! ఆడబడుచంటే అర్ధ మొగుడు తెలుసా ?" ఇందిర ఫుల్‌స్టాప్ లేకుండా మాట్లాడేస్తూంది.

"కూర్చోండి మర్యాద చేయనందుకు ఈ దీను రాల్ని మన్నించండి సరే కాని, అర్ధ మొగుడు గారూ, మీ తలనొప్పి తగ్గిందా ?"

"తలనొప్పా, నాకా ! ఓహో అదా. అన్నయ్య మీతో ఏకాంత సమావేశాన్ని కోరాడు అంత పెద్ద అన్నయ్య డీలా పడిపోవడం చూసి, జాలిపడి, నేను రాలేదు అంతేకాని, నాకు తలనొప్పి లేదు. ఏంలేదు" అంది ఇందిర నవ్వుతూ

శ్రీధర్ కళ్లు పద్మమీదే ఉన్నాయి మాట్లాడ కుండా వదినా, ఆడబడుచుల సంభాషణ వింటు న్నాడు

కాఫీలు అయిన తరువాత ముగ్గురూ బయలు దేరారు మధ్యలో ఇందిర దిగిపోయింది

"నువ్వు అంగీకరిస్తావో, నిరాకరిస్తావో అని నేను ఎంత మథనపడ్డానో తెలుసా ? "రాత్రంతా నిద్ర లేదు" అన్నాడు శ్రీధర్ పద్మవైపు ఆప్యా యంగా చూస్తూ. "నేను అంగీకరించానని ఎవరు చెప్పారు ? ఎప్పుడూ సిమ్మెంటు, యిసుకతో మునిగి తేలేవాళ్లని ఎవరు చేసుకుంటారు బాబు ?" అంది పద్మ.

"ఓహో ,ఇదొకటా ! నువ్వు కాదంటే నిన్ను ఎత్తుకుపోయి రాక్షస వివాహం చేసుకుంటాను తెలుసా ?"

రెండు రోజుల తర్వాత శ్రీధర్ వెళ్లిపోయాడు. అతనిని సాగనంపడానికి పద్మ, ఇందిర ఇద్దరూ స్టేషనుకి వెళ్లారు

"మళ్లా నేను వచ్చేటప్పటికి బుంగ మీసాలు పెంచుకుని రమ్మంటావా, పద్మా ?" అన్నాడు శ్రీధర్ అల్లరిగా

"నాకు అంతంత మీసాలవాళ్లని చూస్తే భయం బాబు" అంది ఇందిర

"అయితే నీకు తప్పకుండా ఒక సింగ్‌ని తీసుక వస్తాలే" అన్నాడు శ్రీధర్

రైలు కదిలిపోయింది పద్మ, ఇందిర కొంచెం సేపు చూసి బయటికి నడిచారు. 

# మూడేండ్లుగా అందరినోటా ఆడుతున్న

## ఏమిటి? ఎందుకు?




నెలకు అయిదే అయిదు రూపాయలతో, సరిగ్గా సంవత్సరన్నరలోపల స్వంతానికి సంసారపక్షమైన ఒక చిన్న గ్రంథాలయం కూర్చుకొని, ఇంటిపట్టుననే ఇంచక్కా కాలక్షేపం చేయడానికి ఘనమైన ఉపాయం హెచ్. యల్. పి. అదే ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక.

## ఏమి చేయాలి?

మా ప్రణాళికకు చందాదారుగా నెల నెలా రూ. 5 చొప్పున 18 నెలలు కడితేసరి. అంతే.

## ఏమేమి వస్తాయి?

మీరు కట్టే ఆ మొత్తం రూ. 90లకూ రూ 100ల పుస్తకాలు వస్తాయి. వాటిని మా ఇష్టంగాగాక మీమీ ఇష్టప్రకారమే, దేశంలోని దాదాపు 150 మంది ప్రచురణ కర్తలు ప్రచురించిన 2000కు పైబడ్డ పుస్తకాలనుంచి ఎంచుకోవచ్చు.



ఇవికాక దాదాపు 32 ఉచిత పుస్తకాల పట్టీనుంచి మీ ఇష్టం వచ్చిన మరో 10 పుస్తకాలు ఉచితంగా వస్తాయి. (ఇందులో 3 మీరు చేరిన్న తక్షణమే వస్తాయి.)

ఇదికాక పుస్తకప్రియుల అభిమాన మాస పత్రిక 'పుస్తక ప్రపంచం' 18 నెలలపాటు ఉచితంగా వస్తూ ఉంటుంది.

వీటికితోడు మా పంపిణీలోని రెండువేలా పైచిలుకు పుస్తకాల పెద్ద క్యాటలాగు (దాదాపు 90 పేజీలది) ఉచితంగా వస్తుంది.

పైపెచ్చు పై అన్నిటికి రవాణా ప్యాకింగు ఛార్జీలు ఉచితం.

## ఎప్పుడెప్పుడు వస్తాయి?

మొదటి నెల చందా రూ 5లూ కట్టిన వెనువెంటనే

1. మొదటి మూడు ఉచిత పుస్తకాలూ,
2. ఆ నెల 'పుస్తక ప్రపంచం' సంచికా,
3 మా పెద్ద క్యాటలాగూ

మీ ఇంటికి వెతుక్కుంటూ వస్తాయి.

ఆరు నెలలూ ముగిసి మీ ఖాతాకింద రూ. 35 జమపడంగానే మా క్యాటలాగునుంచి మీకు మీరై ఏరికొరుకొనే రూ. 30ల పుస్తకాలూ, మరో 2 ఉచిత పుస్తకాలూ వస్తాయి.

ఇంకో 6 నెలలుదాటి మీ ఖాతాకింద రూ. 65 జమపడంగానె అలాగే ఇంకొక రూ. 30ల పుస్తకాలూ ఇంకొక 2 ఉచిత పుస్తకాలూ వస్తాయి.

18 నెలలూ పూర్తికాగానే తక్కిన రూ. 40ల పుస్తకాలూ, తక్కిన 3 ఉచిత పుస్తకాలూ వస్తాయి.



ఏతావాతా మొత్తంమీద మీకు రూ. 100ల పుస్తకాలూ, అదనంగా మరో 10 పుస్తకాలూ, 18 నెలలపాటు 'పుస్తక ప్రపంచం' పత్రికా వస్తాయన్నమాట. అన్నిటికీ కూడా రవాణా ప్యాకింగు ఖర్చులేవీ మీకు లేకుండానే.

నెలసరి రూ. 5ల తేలిక చందాలుగా
మీరు కట్టేది రూ. 90
పుస్తకాల రూపంలో నైతేనేమి,
పై ఛాకీరీల రూపంలో నైతేనేమి
మీకు ముట్టేది రూ. 131
మొత్తంమీద మీకు గిట్టేది
దరిదాపు రూ. 41

ఇది బహు సులువు—
బహు తేలిక—
బహు లాభసాటి—

### కాబట్టి వెంటనే చేరండి

ముఖ్య గమనిక · ఏ కారణం చేతనైనా మీరు చందా కడంటా కట్టలేకపోతే ధారాళంగా మానివేయవచ్చు. అప్పటికి మీరు కట్టిన సొమ్ము మీకు పుస్తకాల రూపంలో ముట్టి తీరుతుంది. కాకపోతే ఈ లెక్కలో మీకు అంతవరకూ పంపిన ఉచిత పుస్తకాలూ, పుస్తక ప్రపంచం సంచిక ధర మినహాయిస్తాం. అంతే.

# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

ట్రైనింగ్‌కు ఆంధ్రప్రదేశ్‌లో వసతులు లేవు. ఆదివరలో కొన్ని బదిలీలు అయిన సందర్భంలో ఉద్యోగస్థులు సమర్పించిన వినతి పత్రానికి జవాబుగా అధికారులు కొన్ని హామీలు కూడా ఇచ్చారు వాటిల్లో ముఖ్యమైనది, బేగమ్‌పేట ఇంజనీరింగ్ బేస్‌ను ఇంకా అభివృద్ధి చేస్తామని, ఇంకా ఇతరత్రా ఉన్నచోట్ల పనిని కూడా ఇక్కడికే తరలుస్తామని అన్నారు. అలాంటిది అభివృద్ధి మాట అటుంచి, అసలే ఇక్కడి నుంచి తీసేద్దామనే ఉద్యుక్తులవుతున్నారు.

దీన్ని విరమించి, బేగమ్‌పేట ఇంజనీరింగ్ బేస్‌కు 'ఫోకర్ ఫ్రెండ్‌షిప్' ఎయిర్ క్రాఫ్ట్‌కు సంబంధించిన పనిని అప్పగిస్తే, దీనివలన కార్పొరేషన్‌కు ఆర్థికంగా కలిగే నష్టంలేదు 700 మంది సిబ్బంది, బొంబాయి వెళ్లాలసిన అవసరమూ ఉండదు ఈ విషయాన్ని ఇక్కడ ప్రభుత్వంవారు గమనించినా, యెంతరవకు శ్రద్ధ తీసుకుంటున్నారో తెలీటంలేదు. కేంద్ర మంత్రి వర్గంలో ఏవియేషన్‌కు సంబంధించిన ఛోటా మంత్రి సికింద్రాబాదునుంచే వెళ్లాడు. ఇక్కడి నుంచి ఓట్లు తీసుకొనటంతో ఆయన పని అయిపోయినట్లుగా ముభావంగా ఉండిపోయాడు. 1964 ప్రారంభం నాటికి ఇలాంటి మార్పులు రాబోతున్నాయి. కాని ఈలోగానే, ఓనెల రోజుల్లోనే మొట్టమొదటి 25 మందిని కదిలించటానికి ప్రయత్నం చేస్తున్నారు. వీరి తర్వాత మిగతా వారికి ఉద్వాసన చెప్పబోతున్నారు. కనక వెంటనే ప్రభుత్వంవారు ఈ తీవ్ర పరిస్థితిని గమనించి, సత్వర చర్యలు తీసుకోవలసిన అవసరం యెంతైనా ఉంది. కార్పొరేషన్ వారి అనాలోచన చర్యవల్ల, నిరసనగా, ఆక్షేపణగా, సిబ్బందిని, ప్రత్యక్ష చర్యలకు, ఇతర ఆందోళనలకు గురికానీయకుండా చూడవలసిన బాధ్యత కూడా ప్రభుత్వం వారిమీద ఉంది ★

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

(సీనియారిటీ) అనే కొలత బద్దతోచూస్తే పార్లమెంటరీ వ్యవహారాల మంత్రికే, ఈ ఆర్థిక— అది తప్పితే దేశీయ వ్యవహారాల శాఖల మంత్రి అయ్యేందుకు ఎక్కువ అర్హతలున్నాయి. ఎందుకంటే తన హద్దులు అర్హత లేమిటో ఆయనకు బాగా తెలుసు. పైగా గొప్పపనులేమో చేసినట్లూ ఆయన ఎప్పుడూ చెప్పుకోలేదు.

సర్దార్ స్వరణసింగ్ దేశీయ వ్యవహారాల మంత్రి అవుతారని అంటున్నారు. -ఇంకో రాజకీయ 'విరాగి' లాలాగుల్జారీలాల్ నందాకు, ప్రణాళికా సంఘాన్ని 'మరామతు' చేసి, తర్వాత— ఆర్థిక మంత్రి అవుదామని మేడలు కడుతున్నారు. ఉత్తర ప్రదేశ్‌నుంచి వచ్చిన మంత్రి అలీజహీర్‌ను రైల్వేల మంత్రిగానూ, ఇప్పటి కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ సంజీవయ్యను కేంద్రమంత్రి వర్గంలోకి తీసుకుని శ్రీ జగజ్జీవన్‌రాం స్థానే 'కమ్యూనికేషన్ల' మంత్రిగా నియమిస్తారని అనుకుంటున్నారు. ఈ సంగీతపుకుర్చీ' ఆటలో అతిగతి పట్టకుండా, ఓ మూల పడిఉండట్లా ఒక్క ఆహార వ్యవహారాల శాఖమాత్రమే. ఒక్క రఫీ అహమ్మద్ కిద్వాయ్ (అదృష్టవంతుడు) త్వరగా చచ్చిపోయాడు) తప్ప మిగిలిన వారు అంటే బాబూ రాజేంద్రప్రసాద్ (తాత్కాలిక ప్రభుత్వంలో), జయరాందాస్ దౌలత్ రామ్, శ్రీ కె యం మున్షీ అందరి విధానాలు విఫలమై పోయాయి ఈ అర్హతలదృష్ట్యా శ్రీలాలా గుల్జారీలాల్‌కు వ్యవసాయశాఖను అప్పగిస్తే చాలా బాగుంటుంది

అయితే ఇక్కడ చాలా విషయాలు ఆలోచనలో ఉన్నాయి. ప్రధాన మంత్రి వార్ధక్యంలో ఉన్నారు సాధారణంగా ఆయన ఎటువంటి తీవ్రమైన మార్పులైనాసరే అంగీకరించరు. అందువల్ల ఆయన ఈ వార్ధక్యంలో చాలా చిక్కులు తెచ్చిపెట్టగల మార్పులను చేయగలరా అనేది ప్రశ్న

ప్రతి పక్షాల వాళ్లు బయటపెట్టినా, పెట్టకపోయినా నిజం నిజమే ప్రధాన మంత్రి అనుకునే మానవత్వం సహృదయత వగైరాల వల్లనే, మన దేశంలో చైనీయుల దురాక్రమణ ఫలంగా గరిగిన ప్రజా చైతన్యం అణగారి పోయిందన్న మాట మాత్రం నిజం 'చైనావాళ్లు మన వాకిళ్ల దగ్గరికొచ్చారోయ్' అని ప్రధాన మంత్రి గోలెట్టినంత మాత్రాన మళ్లీ అంతటి ప్రజా చైతన్యం కలుగటం అసంభవం. ప్రధాన మంత్రి మండలిని అగ్గించుకోవటానికి నిరాకరించటమే గాక, తన మంత్రుల్లో పేరుకు పోయిన దుబారా స్వభావాన్ని అరికట్టలేక పోవటం కూడా చైతన్యం చెల్లా చెదరై పోవటానికి ముఖ్య కారణమైంది మొన్న మొన్న గూడా ఒక తమాషా జరిగింది కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జగజ్జీవన్‌రాం రక్షణ మంత్రి శ్రీ చవన్‌కు నాలుగు తపాలా బిళ్లలు అమ్మితే ఆ 'మహోత్సవానికి' ప్రధాన మంత్రి శుభ సందేశం పంపారు !

ఈ సామ్యవాద వ్యవస్థలో ఒక ప్రక్కన బీదాబిక్కీని రక్షణ చర్యలకే గాక, బాబూ యస్. కె. డే 'మాయాజాలం' గ్రామీణ రక్షణ దళానికి కూడా ఉదారంగా సహాయం చేయమని అడుతున్నారు ఇంకో ప్రక్కన దేశం డబ్బుతో స్వప్రచారం చేసుకుంటున్న శ్రీ జగజ్జీవనరాం తమ చర్యలకు వారం వారం ఏదో ఒకసాకు చెప్పుకోక తప్పదు ★

## వివాహం

శ్రీమతి శాంతా హెచ్. డి. రాజా తమ కుమార్తె సౌ. ఉషను శ్రీ ఎస్. వి. స్వామి (బి. ఎ) కుమారుడు చి. వి సుందరం ఐ. ఏ. ఎస్. కు ఇచ్చి ఈనెల (ఆగస్టు) 25 వ తేదీన మద్రాసులోని అబ్బట్స్‌బరీలో వివాహం జరిపారు. అనాటి సాయంత్రం 6 గంటలకు అతిథి సత్కార విందును ఏర్పాటుచేశారు పలువురు ప్రముఖులు హాజరై వధూవరులను ఆశీర్వదించారు. ★

## అవీ-ఇవీ-అన్నీ

11 వ పేజీ తరువాయి

మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు : ముద్దుకృష్ణ, సంగీతం : ఘంటసాల, ఛాయ : పి. దత్తాత్రేయ, (నెప్ట్యూన్ స్టూడియోలో చాలా చిత్రాలకు కెమెరా ఆపరేట్ చేసిన వ్యక్తి టింగ్—రంగా నుండి ప్రతి చిత్రంలోను ఎవరో ఒకరిని క్రొత్త వారిని పరిచయం చేస్తున్న దర్శకుడు బి. ఏ. సుబ్బారావు దత్తాత్రేయకు ఈ చిత్రానికి ఛాయా గ్రహణదర్శకునిగా అవకాశ మివ్వడం జరిగింది.) స్టంటు : సోము, నృత్యం : వి. జె. శర్మ, కూర్పు : మార్తాండ్, నిర్మాత : హబిబుల్లా, దర్శకుడు : బి. ఏ. సుబ్బారావు.

### "మూఢనమ్మకాలు" రికార్డింగ్

"ఎంతో వింత మానవుడు. . . .
తన నీడకు భయపడు — భీరుకుడు. . .
ఏది మంచి— ఏది చెడు— ఎరుగక ఏదో
బ్రతుకునులే



"దిల్ ఏక్ మందిర్"లో మీనాకుమారి

సందేహాలేవో పెంచుకొని— బ్రతుకంతా
వెత పొందునులే"

రచయిత రాజశ్రీ వ్రాయగా పి బి శ్రీనివాస్ పాడగా అరుణాచల స్టూడియోలో రికార్డు చేయ బడింది

"బొమ్మలాగనే నూరుకోను
నీ పని ఇక నేనే పడతాను . . . .
ప్రియమున కోడలి మనసును తెలిసి
ప్రేమ చూపడం అత్తవిధి మర్యాద"

ఈ పాటకూడా రాజశ్రీ వ్రాసినదే పి బి. శ్రీనివాస్ మరియు ఎల్ ఆర్ ఈశ్వరి పాడగా అరుణాచల స్టూడియోలో రికార్డు చేయబడింది.

ఈ చిత్రం సెప్టెంబరులో విడుదల కానున్నది. మాటలు— పాటలు రాజశ్రీ, కూర్పు : రామదాసు, దర్శకత్వం శ్రీనివాసన్, నిర్మాత : సంగీత దర్శకుడు • శ్రీరామ్

సి ధర్మారావు. ★

Edited, Printed and Published by S Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street
Madras 1. Chief Editor S. Sambhu Prasad.

